# ఋ తు చ ర్యా



నరత్వం విప్రత్వం తదను పురుషత్వంచకవనం
మహామాయే మాత ర్మయి సముపపన్నం తవదృశా
త్వయా దత్తై శ్చైతై ర్విబుధజనమాన్యైః పదసుమైః
కరోమి త్వత్పూజా మపర మపరమ్యం భవతు మే.




ర చ యి తా

**దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి**

# పరిచయము

ఋతుసంహారమనుపేర సంస్కృతభాషలో మహాకవి కాళిదాసు ఒకఖండకావ్యమును రచించెను. దానిని చదివిన వెనుక నాకీకావ్యరచనకు బుద్ధి కలిగినది. సంస్కృతకవులును ఆంధ్రకవులునుగూడ తమకావ్యములందు ఋతువర్ణనములు చేసియేయున్నారు. మాఘకవి ఆరుఋతువులను వర్ణించినాడు. కాని అవి ప్రాసంగికములు. ఆధునికతెనుగుకవులును ఈ ఋతువులను వర్ణించినారు.

ఈఋతువులందు స్థావరజంగమములలో గలిగెడి మార్పులు, అందచందములును పూర్వకవులు వర్ణించిరి. అందు ప్రపంచవ్యాప్తములైనవిషయములనే వారు గ్రహించిరి. వారి భావము లతివిశాలములు. వానితోపాటు ఋతుప్రయుక్తములైనమానవచర్యలు ఆయాఋతువులలో వచ్చుమహోత్సవముల జయంతులు, ప్రజలాచరించు స్థానికవ్రతాచారవ్యవహారములు పండువులు మున్నగునవి ఈకావ్యమున నేను గ్రహించితిని. కాళిదాస మాఘకవులు శృంగారప్రాధాన్యముగ రచించిరి. నాకావ్యమం దారసమున కల్పప్రవేశ మున్నది.

కాలమునుబట్టి నాభావములు చాలవఱకు నవ్యములును, భారతదేశపర్యాప్తములు నైయున్నవి ఇందలి కొన్ని స్థానికాచారవ్యవహారములు పరత్ర క్రొత్తగ దోచవచ్చును. ఏ యాచారము లేవిధముగ మనప్రాచీనులు ఆచరించెడివారో

అందలి గభీరాశయము లేవేవో ఇందు కొన్ని వ్రాయబడినవి. ఇందు పూర్వకవిసంప్రదాయముల నుల్లంఘింపలేదు. భారతీయాచారము లన్నియు ధర్మశాస్త్రనిర్ణీతములు. ఆయురారోగ్యసూత్రముల కనుబంధములు. మనభారతీయసంస్కృతికి ప్రతీకలు. అట్లని ఈకావ్యమందు ధర్మశాస్త్రవిషయము లన్నియు గ్రుచ్చియెత్తలేదు. అట్లగుచో అది కావ్యమే కాదు.

శ్లోకాభిప్రాయములు తేటతెల్ల మగుటకై చంద్రిక అనుపేరున తాత్పర్యము చేర్పబడినది. నా తృతీయపుత్రికారత్నము రత్నావలి దానిని వ్రాసినది. ధ్వనిప్రధానమై ప్రసిద్ధము లగునర్థాలంకారములచే నలంకృతమైన ఈకృతి సహృదయానందక మగునని నాయాశ.

కావ్యమును విని నాశిష్యరత్న మైన వాసుదేవమూర్తి దీనిని ముద్రింపబూనుట నా కమితానందమైనది. కావ్యశ్రవణము చేసి నాశిరసున ఆశీరక్షతలు చల్లిన అభిప్రాయదాతలకు నాకృతజ్ఞతా వందనములు. ముఖ్యముగా కాకినాడ సంస్కృతప్రచారసభవారి ప్రోత్సాహబలముచే ఈకృతి యీవిధమున రూపొందినది. ఆకార్యవర్గమువారికి నాప్రాంజలులు. కావ్యమును ఇతిశ్రీగ పరిశీలించిపెట్టిన విద్వచ్ఛిరోమణి శ్రీ సామవేదం శ్రీరామమూర్తిశాస్త్రిగారికిని, పండితమండన శ్రీశ్రీ ఆకెళ్ల శేషాద్రిశాస్త్రికిని నాధన్యవాదములు.

—రచయిత.

## కృతిసమర్పణ

జగత్ర్పఖ్యాతిగన్న నారచన అహల్యా కావ్యమును కృతిగొన్న ఆంధ్రభీష్మ అనుపేరున మన్న కీ॥ శే॥ శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావుపంతులుగారి ఏకైకపుత్రిక లక్ష్మీనరసమ్మ గారు. ఈమెభర్త శ్రీ తుర్లపాటి వెంకటాచలము అడ్వొకేటు గారు. ఈసతీపతుల కీఋతుచర్యకావ్య మంకితము.

ఆగస్టు 15వ తేదీని శ్రీ తుర్లపాటివారికుటుంబసభ్యులతో నేను లోకాభిరామాయణము మాటలాడుచున్నాను. అప్పుడు పై దంపతుల కేకైకపుత్రుడును M. Sc, పట్టభద్రుడును, ప్రస్తుతము పాలకొల్లు ప్రభుత్వకళాశాలలో ఉపన్యాసకుడుగా పని చేయుచున్న చిరంజీవి వాసుదేవమూర్తియు నున్నాడు. అహల్యా కావ్యములోని కొన్నిఘట్టములు చదువుకొనినాము. ఆప్రసంగములో నాసంస్కృతరచన 'ఋతుచర్య' విషయము రాగా అందుండి కొన్నిశ్లోకములు వినిపించితిని. పిన్నవాడైనను ఉన్నతభావములు గలవాసుదేవమూర్తి ఆకృతిని మాతలిదండ్రుల కంకిత మీవలెను. అని అన్నాడు. ఆమాట కచటివా రందఱు నానందించిరి.

ఈకుటుంబముతో నాకు 1938 నుండియు పరిచయము కలదు. వీరిబిడ్డ లందఱును నాకడ కొంచమో గొప్పో సంస్కృత మభ్యసించినారు. అందు వీరికనిష్ఠసుత యగు శ్రీమతి లక్కరాజు రమణమ్మ నాయొద్ద చదివి భాషాప్రవీణ పరీక్ష నిచ్చి కాకినాడ

లోని స్త్రీలహైస్కూలులో ఆంధ్రబోధకురాలుగ పనిచేయు చున్నది. శ్రీ వెంకటచలంపంతులుగారును నాఅహల్యాకావ్యమును తమ మామగారగు ప్రకాశరావు పంతులుగారి కంకితము చేయవలెనని కోరి దానికి వలయు ఆర్థికసాహాయ్య మొనర్చి నారు. రతనాలగనిలో రతనాలే పుట్టునుగదా!

చిరంజీవి వాసుదేవమూర్తి IV ఫారమునుండి ఇంటరు వరకును నావలన సంస్కృతము నేర్చినాడు. 1950 లో బి. ఎస్‌సి. ద్వితీయశ్రేణిలో నుత్తీర్ణుడై 1959లో యమ్.ఎస్‌సి. పరీక్ష నిచ్చినాడు. మున్ముందట కాకినాడ ప్రభుత్వకళాశాలలోను, పిదప విశాఖపట్టణములోని వి. ఎస్. కృష్ణా ప్రభుత్వ కళాశాలలో నుపన్యాసకు డైనాడు. సాధుశీలుడు. "యత్రాకృతి స్తత్ర గుణాః" అన్న నుడికి తారకాణ మైనవాడు. తన తాతల యున్నతాశయము లీతనిలో బీజావాప మందినవి.

తన జనకులపేరు సుప్రతిష్ఠిత మొనర్ప కృతికోరిన ఈ పిన్నవానిమాట నాకు ఆశ్చర్యమే కలిగించినది. పిదప అతని అక్క చి॥ సౌ॥ కావలి శేషశాయిగూడ తమ్మునిమాటను బల పరిచినది. 'తథాస్తు' అని నే నంటిని. ఆతని పితృభక్తి యట్టిది.

సంస్కృతభాషను పునరుద్ధరింప తలంపు గల నేటికాలమున నిత డీసంస్కృతకావ్యమును వెలుగులోనికి తేదలచుట మెచ్చదగిన విషయముగదా! దీని నాంగ్లానువాదముతో కలిపి ప్రచురింపవలె ననియు ఆశపడినాడు, కాని ఆపనిచేసి పెట్టగల

వారు ప్రయత్నసాధ్యులగుట అది సాగలేదు. తెనుగుభావము మాత్రము వ్రాయవలసినదిగా కోరుటచే అట్లొనర్చితిని. ఇట్టి సంస్కృతకావ్యమును ప్రచురింప తన కష్టార్జితమును వెచ్చించి నాకు ప్రోత్సాహ మిచ్చి తన యౌదార్యమును జూపిన శ్రీ వాసుదేవమూర్తియు తత్కుటుంబసభ్యులును గైర్వాణ వాణీకటాక్షవీక్షణముల సమస్తసౌఖ్యము లందుదురుగాక అని నాఆశీస్సు.

వా సు దే వు ని కు టుం బ ము

'యం. బి. బీయస్' నేర్చునట్టి జ్యేష్ఠకుమారు
డల వృద్ధసేవాపరాయణుండు
'బియ్యే' పఠించెడిపిన్న రెండవవాడు
పితృభక్తితత్పరప్రేమమయుడు
'బీకాము' చదివెడి పెద్దకొమార్తెయు
సుకుమారసుందరశోభనాంగి
'ఇంటరు' చదివెడి యెలనాగ రెండవ
అమ్మాయి ముగ్ధమోహనసురూప

కనులలోన లక్ష్మికలకాంతు లొప్ప
తనరుస్మితపూర్వభాషిణి ధర్మపత్ని
తాను జీవజ్జనకు డయి తనరు; తుల్ల
పాటి వాసుదేవు డదృష్టభాగ్యశాలి.

—కృతికర్త.

# ఆప్త వాక్యము

శ్రీ సూర్యనారాయణశాస్త్రి నాఆప్తబంధువు. 'సూరిబాబు' అని నాపిలుపు. ఇతని తెనుగురచనలు, ఆంధ్రమదరాసు ఉత్కలవిశ్వవిద్యాలయములవారాయాఉన్నతకక్ష్యలకు పాఠ్యముగ నిర్ణయించుట లోకవిదితము. ఇతని తెనుగునుడికారము ద్రాక్షాపాకము.

ప్రకృత మితడు 'ఋతుచర్య' అనుగీర్వాణభాషాకావ్యమును రచించినాడు. నేను కంటిఆపరేషన్‌స్థితిలో ఆస్పత్రిలోనున్నపుడు ఒకవారముగోజులలో నాకీకావ్యమును వినిచినాడు. విన్నాను. ఆరోజులలో నాకీకావ్యశ్రుతి సత్కాలక్షేపమే. ఒకొక్క శ్లోకము-ఒకొక్క కల్పనము-విశేషించి బాబు మధుర కంఠము-వినసొంపైనవృత్తములు-గలగల జాలువాఱువాణిన నన్నివిధముల ఈకావ్య మావర్జించుకొన్నది. ఇవిగాక ఇతడు సంస్కృతభాషలో వేమనరత్నములు, కేయంబిభీషికా, అను కావ్యములుగూడ రచించి నాకు వినిపించినాడు. "ఓరియంటల్‌తరగతుల కిట్టి నవ్యకావ్యాలు పాఠ్యము లైన బాగుండును. యత్నింతము" అనియు అన్నాను. సహృదయు లీ చిఱుకావ్యమందలి నూతనతను - గాంభీర్యమును-సుకుమారభాషాశైలులను పరిశీలించి ఆనంద మందగల రని నా అభిప్రాయము-వయసులో నేను పెద్దను. వరుసలో ఆతడు పెద్ద. కాన ఇంతకన్న ఆశీస్సులిచ్చుట నా కభిమతముకాలేదు.

కళాప్రపూర్ణ, విద్వాన్ దువ్వూరి వెంకటరమణశాస్త్రి

కాకినాడ, 15-8-1976.

# ఆశీః

నా అంతేవాసి విద్వాన్, కవిశిరోమణి దువ్వూరి సూర్య నారాయణశాస్త్రి సంస్కృతభాషలో వ్రాసిన 'ఋతుచర్య' అను కావ్యమును కవిముఖముగా నేను విన్నాను. నా యొడలు పులకరించినది. దానికి కారణ మిది గైర్వాణిగా నుండుటయేగాక ఇందలి భావకల్పనాదీపకాంతులు జాజ్వల్య మానము లగుటయే. ప్రస్తుతకాలమున సంస్కృతకవనము చెప్పువా రరుదు. ఇందనుక ఇత డాంధ్రభాషాకవిగానే ప్రశస్తి కన్నాడు. నేడు తనఉభయభాషాప్రవీణత రుజువుచేయుటకో అన్నట్లు ఈకావ్యగుచ్ఛమును వాణికి సమర్పించినాడు.

సంస్కృతములో కాళిదాసకృత ఋతుసంహార కావ్యము సుపరచితము. అందలి భావములు సువిశాలములు. అట్టివిషయ ములను విడువక, ఆయా ఋతువులలో భారతదేశపర్యాప్త ముగా జరుగు ఆచారవ్యవహారధర్మములు, మహాత్ముల జయంతివర్ధంతులు, ముఖ్యవ్రతాదులు, దేవోత్సవాదులు గూడ ఇందు వర్ణింపబడుట విశేషము. ఇందలిశ్లోకములు మనోహర ములు. కల్పనము లనల్పములు. కొద్దిపాటి శృంగారము, కొల దిగా హాస్యమునకు గూడ నిందు తావున్నది. భాషయు నిర్దుష్ట ముగా నిరాఘాటముగ సాగినది. ఋతువులలో గల్గు విశేషము లన్నియు ఇందు పరిపూర్ణతనందినవి. 'చారుచర్య' వలెనే దీనికి 'ఋతుచర్య' నామము సార్థకముగ నున్నది. ఈతడు ధన్యుడగుటకు నా ఆశీస్సులు.

ఆర్ష విద్యాభూషణ, జటావల్లభుల పురుషోత్తం,

కాకినాడ, 5-5-1971.

# ఋతుచర్యా

[వసంతము - చైత్రవైశాఖములు]

"ఋతుకర్తా జగజ్జ్యోతి ర్ద్వాదశాత్మా త్రయీతనుః
ప్రత్యక్షదైవతం సూర్యః పాత్వారోగ్యప్రదాయకః"

"వసంతోఽయం హాసః నిటలనయనం గ్రీష్మసమయః
శిరోగంగా వర్షా శ్శరదృతురభూ ద్దైందవకలా
తనోర్దీప్తి ర్హేమా శిశిర మభవత్ దృక్పరిణతిః
మహాదేవ స్సత్యం జయతి గిరిశోఽయం ఋతుమయః"

చంద్రిక:—పరమేశ్వరునినవ్వే వసంతఋతువు. ఆతని నిప్పుకన్నే గ్రీష్మము. జటలలోనిగంగయే వర్ష ఋతువు. తల నున్న చంద్రకళయే శరత్తు. తెల్లని అతని దేహకాంతియే హేమంతము. అతనిచల్లనిచూపులే శిశిరము. ఈవిధముగ పరమశివుడు షట్ఋతుస్వరూపుడని ధ్యానము. ఇందు ఆయా ఋతుధర్మాలకు-శివునిలక్షణములకు అభేదము.

"వసంతో వంశీవా గరిదరరథాంగం శుచి రభూ
త్తనోర్దీప్తిః ప్రావృట్ శరదృతు రభూ న్నేత్రకమలమ్
మహాహేమా శంఖః శిశిర మభవ ద్దృక్పరిణతిః
హృషీకేశ స్సత్యం జయతి వనమాలీ ఋతుమయః"

చంద్రిక:—శ్రీకృష్ణుని వేణునాదమే వసంతశోభ. తీక్ష్ణత గలచక్రాయుధమే గ్రీష్మర్తువు. మేఘశ్యామల మైనదేహమే

వర్షర్తువు. పుండరీకాక్షత్వ మే శరదృతువు. పుండరీక మనగా తెల్లతామర. ఆతని తెల్లనిశంఖమే హేమంతము. అతని చల్లనిచూపులే శిశిరము. ఈవిధముగ శ్రీకృష్ణపరమాత్మ షట్ ఋతుస్వరూపు డని ధ్యానము ఇందు ఆయాఋతుధర్మాలకు కృష్ణుని లక్షణములకు అభేదము. హరహరులను స్తుతించుటచే వారిరువురు నొకరూపమే. అధికారముల రీతిచే నిద్వరుగా కానుపింతు రని సూచితము. "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అనుమహావాక్యార్థము ధ్యేయము.

"గుచ్ఛస్తనీ పద్మముఖీ కిసాలోష్ఠీ లతాతనుః
కర్ణికారారుణపదా తారకాగ్రనఖప్రభా
అలినిస్వనమంజీరరవా విటపసద్భుజా
అనంతపుష్పాభరణా భ్రమరశ్రేణివేణికా
కోకిలాలాపసల్లాపా తిలపుష్పాభనాసికా
రక్తోత్పలార్ద్రతిలకా శ్వసనశ్వాస సుందరా
మాధవేన సమాయుక్తా వనవాహ్యాళితత్పరా
మహాసువాసినీరూపా మధులక్ష్మి స్సమాగతా."

చంద్రిక:— వసంతునితోకూడి వనములందు తిరుగు కోరికతో సువాసినివలె ఈఋతుశోభ వచ్చిపడ్డది. ఈమె స్వరూప మిది. ఈవసంతలక్ష్మికి పూలగుత్తులే స్తనములు. పద్మములే ముఖము. చివుళ్లే పెదవులు. లతలే దేహము. కొండ గోగుపువ్వులే అమె యెఱ్ఱనిపదములు. నక్షత్రములే ఆమె

గోళ్లు. తుమ్మెదరొదలే అందెలమ్రోతలు. చెట్లకొమ్మలే ఆమె చేతులు. వివిధపుష్పములే ఆభరణములు. తుమ్మెదపంక్తియే జడ. కోకిలకూతలే పలుకులు. నువ్వుపువ్వే ఆమె ముక్కు. ఎఱ్ఱకలువయే బొట్టు. పిల్లగాలులే నిశ్వాసములు. ఇట లక్ష్మి మాధవునితో గూడుట ధ్వనింపచేయబడినది.

"పుంస్కోకిలభ్రమరగానమనోజ్ఞమంత్రైః
శుభ్రాంశుకల్పితపురోహితసర్వతంత్రైః
మాధ్వీకపుష్పఫలపూగపలాశపాత్రైః
జాగర్తి మాధవసమర్పితకామపూజా."

చంద్రిక:— చంద్రు డనెడిపురోహితుడు, కోకిలల, తుమ్మెదలకూత లనెడిమంత్రములు చదువుచు, పూజాతంత్రములను నడపుచుండగ తేనె, పూలు, పండ్లు, పోకలు, ఆకులు కూర్చుకొని పత్రము లనెడిపాత్రలయం దిడి వసంతుఁడు మదన పూజను చేయుచున్నాడు.

"వివిధపుష్పసుగంధి రజోవృతం
కలితచూతకిసం పికకాహళమ్
కుసుమపూర్ణలతావనితాకులం
జగదహోను వివాహగృహాయతే."

చంద్రిక:— పెండ్లిగృహమం దేయేలక్షణము లుండునో అవి యీ ఋతువు నం దుండుటచే లోక మొకవివాహగృహముగ నున్నది. పూలపరిమళములు అత్తరువాసనలుగా, పుష్ప

ళ్ళతో గూడుట బుక్కాముతో నిండినటులుగా, మామిడి చివుళ్లు తోరణములుగా, కోకిలకూతలు సన్నాయిపాటలుగా, తలలందు పూబంతులు తాల్చినలత లనెడిస్త్రీలతో నిండి లోకమే పెండ్లివారి యిల్లైనది.

"ఆమూల ముక్తసలయాః
పరిమలసుమభారసంగతా వల్ల్యః
సానందకృతవసంతో
త్సవయువతీసామ్య మాదధతే."

చంద్రిక:—పరిమళమిళితము లగురంగురంగుపూలతో నిండినతీగలు పెండ్లియైనవెనుక శుభచిహ్నముగా వసంతోత్సవమున ఒడలెల్ల కుంకుమజలమును చల్లుకొన్న యువతులవలె నున్నవి. వివాహములందు అయిదవరోజున వసంతోత్సవము చేయు టాచారము.

"గంధవాహగురుచాలితా లతా
నర్తకీ భ్రమరకోకిలగీతైః
పుష్పపల్లవపరాగభూషితా
నాట్య మాచరతి కాననరంగే."

చంద్రిక:—గాలి యనెడిగురువు నేర్పగా, కదలిక లనెడి విన్యాసములు చూపుచు, తుమ్మెదలు, కోయిలలు పాటలు పాడుచుండగా, పూలు చివుళ్లు తలలందు పెట్టుకొని, పుప్పొడి యనెడి (పౌడరు) పరాగము నలంది, వన మనెడిరంగస్థలమున లతాయువతి నాట్య మాడుచుండెను.

"స్తబకకుచాం పుష్పవతీం
సువాసినీం పల్లవాధరాం వనీవల్లీమ్
పికమిత్రచోదితోఽసౌ
మధువ్రత శ్చుంబతీహ ధూర్తవిటః".

చంద్రిక:—పూలగుత్తు లనెడి కుచములుగల; యీడేరినదానిని–మంచిపరిమళముగల; ఐదువరాలిని (అనగా వృక్షమే లతకు పతిగనుక) చివుళులనెడి పెదవులు గల వనమందలి లతను, విటులలో ఘనుడై, త్రాగుబోతైనతుమ్మెదగాడు (మకరంద పాయిగాన) కోకిల అనుమిత్రునిచే ప్రోత్సహింపబడి ముద్దు పెట్టుచున్నాడు. ఇందు 'పుష్పవతి–సువాసిని–మధువ్రతశబ్దములు శ్లేషార్థములుగలవి.

"పంచాస్త్రాస్తు వసంతేఽభూల్లక్షాస్త్రో యువవంచనే
పంచభి ర్వంచితో లోకో లక్షోఽలక్ష్యః కథం భవేత్?"

చంద్రిక:—ఈవసంతమందు అయిదే పూలబాణములు గలమదనుడు లక్షలకొలది పూలబాణములు కలవాడైనాడు. అయిదుబాణములతోనే లోకమును సంపూర్తిగ వంచించెనే. లక్షబాణములైనపుడు వాని నలక్ష్యముచేయు టెట్లు ? అనగా లక్షకుసుమాస్త్రములను విరహులమీద ప్రయోగించి బాధించుచున్నాడని భావము.

"వనపాంచాలీపత్రాం
శుకాని గంధవహకౌరవో హరతి
ఆక్రందితా పికోక్తిభి
రాద్రియతే మాధవః కిసాలపటైః."

చంద్రిక:—వన మనెడిద్రౌపది కట్టిన ఆకులనెడి కోక లను, గర్వితుడైన-గాలి యనెడిదుశ్శాసనుడు లాగివేయుచుండ (రాల్చుచుండగా) ఆమె కోకిలగొంతుతో హరికి మొఱలు పెట్టినది. వెంటనే వసంతు డనెడికృష్ణుడు చివుళ్లనెడి పలు రంగుల చీరల నొసంగి ఆదరించెను. ఇందు-గంధవహ-మాధవ అనునవి శ్లిష్టపదములు.

"పుంస్కోకిలాలాపనతః ప్రబోధితౌ
నిశావసానే ఖలు నవ్యదంపతీ
పునారతిప్రాప్తసుఖం భజంతౌ
శయ్యాం జహీత స్సుమనోభిరామామ్."

చంద్రిక:— తెల్లవారుజామున కోకిల అదేపనిగ కూసినది. పరస్పరోత్సుకు లైననూతనదంపతులు ఆకూతలు విని లేచినారు. అపుడు మరల వారు సంభోగసౌఖ్యము నంది పూలతో నిండిన శయ్యను వదలినారు.

"సుమతరుణీసంచారీ
మధుప్రపాయీ సదాప్రలాపీచ
అనవస్థిత రత్యంత
శ్యామో బంభరవిట స్సదా చరతి."

చంద్రిక:—పువ్వు లనెడియువతులతో కలియువాడు, త్రాగుబోతు, ఎల్లప్పుడును వాగుడుగాడు, (తూలుమాట లాడువాడు) నిలుకడ లేనివాడు (త్రాగుబోతువానిపదములు తొట్రిల్లును) మిగుల నల్లని (పాపాత్ముడగు) భ్రమరవిటుడు సర్వదా ఈకాలమున సంచరించుచుండును. ఇందు సంచారీ- మధు-ప్రలాపీ- అనవస్థితిః- అనుపదములు శ్లిష్టములు.

"పంచత్వం మదనాస్త్రేషు పంచమత్వం పికస్వనే
పాంచభౌతిక దేహోఽద్య తత్పంచ త్వేన వంచితః."

చంద్రిక:—కాముని బాణములైదు. ఇందు పంచత్వ మున్నది. "పికః కూజతి పంచమః" అనుటచే స్వరస్థాయి కోకిలకు 'ప' కారము, ఇందును పంచమత్వ మున్నది. మానవ శరీరము పృథివ్యాదిపంచభూతముల సమ్మేలనము కలది. ఇందును పంచత్వ మున్నది. కాన పై పంచత్వములచే ఈ దేహములు బాధింపబడుచున్నవి. పంచత్వమనగా మరణము. వసంతమున కోకిలాలాపములు పూలసమృద్ధియు విరహులకు మరణప్రాయములని భావము.

"భ్రమరకోకిలవాయువిధుస్వహో
విరహిణీవధపాప మనుప్రజేత్
కమితి పృచ్ఛతి కాలవిభౌ ? పికః
పరిచుకూజ భవంత మితీర్ష్యయా."

చంద్రిక:—వసంతఋతురాజు విరహులను బాధించి చంపినపాపము మీలో నెవరిచే అనుభవింపచేయువలెను? దానికి బాధ్యు లెవరు? అని తుమ్మెదను, కోకిలను, మంద మారుతమును, చందురుని అడుగగా, తత్పాపఫలము నిన్నే అంటును. నీవే దానికి కారణము. అని కోకిల ఈరసములో కూసెను. అనగా విరహుల కీకాలము ప్రమాదకర మనియు, పై నలుగురును కాలప్రయుక్తముగ నుత్తేజకరు లనియు భావము. ఇందు కాలవిభుశబ్దము యముడనియు అర్థముగలది.

"వసంతపికసానందగీతికాభ్య స్రవన్మధు
చూతగుచ్ఛే ష్వివాసక్తం చరం త్యత్ర మధువ్రతాః"

చంద్రిక:—వసంతమున కోకిల ఆలపించెడి ఆనందగీత ముల మాధుర్యము– తేనె– మామిడిపూతపై మిక్కిలిగ స్రవించి యుండును. కనుకనే తుమ్మెదలు ఆపూతను తగులు కొని విడువక ముసరుచుండును. "చూతే ద్విరేఫమాలా సవిశేషసంగా" అని ఆర్యోక్తి.

"రక్తముఖా స్సక్రోధా
ఇవ, ఫలభంగప్రలాపినో కీరాః
అరుణాక్షా రుతశాపాః
పికాశ్చ విధురాంస్తర్జయంతీహ."

చంద్రిక:—చిలుకలు కోపముకలవారివలె ముఖము లెఱ్ఱగఁజేయును. వాని ముక్కు తెలుపురంగు గలవి. పండ్లను

ముక్కలుగ కొఱికి తినును. కార్యఫలములను పాడుచేయు స్వభావము గలవని భావాంతరము. మిక్కిలి వదరుచుండును. కోకిలలు త్రాగుబోతులకువలె ఎఱ్ఱనికన్నులు కలవి. కూత లనెడిశాపములు పెట్టుచుండును. ఈరెండును ఈఋతువున వియోగులను బాధించుచుండును.

"కింకిణీకలరవార్ద్రికూజితై
స్సంగతాశ్చ శతశ స్సహస్రశః
సంచరంతి ప్రతిసాయ మంబరే
తోరణాయితబలాకికాగణాః"

చంద్రిక :— ఈకాలమున అనుదినమును సాయంసమయములందు చిఱుమువ్వల గలగలలవలె కలకలకూయుచు, వందలకొలది వేలకొలది గుమిగూడి, తోరణములు కట్టినట్టుగా వరుసలు దీరి, ఆకసమున బెగ్గురుపక్షులగుంపులు రివ్వున విమానముత్రోతతో సాటియైనవేగముతో పయనించి నేత్రపర్వము కావించుచుండును. ఈ భావమునే కాళిదాసు "అస్తంభాం తోరణస్రజం సారసైః కలనిర్హ్రాదైః" అని వర్ణించినాడు.

"మునీనాం పాంథానాం నవయువతతేః ధైర్య మఖిలం
ప్రధున్వన్ చాంచల్యం జనయతి సదా పుష్పసమయః
ప్రభావా ద్యస్యైత జ్జగదహహ కామాంధ మభవ
త్పురారాతిస్పర్ధీ మదనశమన స్త్రత్ప్రియసఖః"

చంద్రిక :— ఈవసంతము మునుల, పాంథుల, నూతన దంపతుల ధైర్యమును పూర్తిగ కదిపివేయుచున్నది. లోకులను మోహప్రవృత్తిలో ముంచెడి-పరమేశ్వరునిగూడ ద్వేషించిన యమునివంటి మదను డావసంతుని ప్రియమిత్రుడుగదా! ఇంక అతనికి పట్టపగ్గము లుండునా ?

"సుగంధివా విగంధంవా దుర్గంధంవా సుమం సమమ్
వికాసయన్ వసంతోఽయం సమవర్తీతి మే మతిః"

చంద్రిక :— పరిమలము గలపువ్వునుగాని, నిర్గంధ కుసుమమునుగాని, దుర్వాసన గలకుసుమమునుగాని సమానముగానే వికసింపచేయు నీవసంతుడు సర్వసమబుద్ధి గలవాడు. యమధర్మరాజు వంటివాడని అర్థాంతరము. సమవర్తి, శబ్దము శ్లేషించినది.

"కక్షేచ తాలవ్యజనం ఫలభారం భుజే వహన్
వైశాఖపూజావ్యగ్రోఽయం విప్రో వీథీషు ధావతి"

చంద్రిక :— చంకయందు విసనికఱ్ఱను, బుజమందు మామిడిపండ్లమూటను ధరించి వైశాఖపూజ లొనర్చువారి యిండ్లకు బాపడు వీధులందు పరువులెత్తుచున్నాడు. ఈకాలమున గృహస్థులు వైశాఖపూజలు చేసి చూతఫలములు విసనికఱ్ఱలు బాపలకు దాన మిత్తు రని సూచన.

"ఉపవనే సహకారతరో స్తలే
రతిపతిం సబలం పరికల్ప్యచ
యువతయః ఫలపుష్పసమర్పణైః
హృదయపూర్వక మర్చితు ముద్యతాః"

చంద్రిక :— ఉద్యానవనమందు తియ్యమామిడినీడలో సపరివారముగ మదనదేవుని నిలిపి పడుచులు ఫలపుష్పముల నొసంగి తమకు మంచిమగలు లభింపవలె ననుకోరికతో మన సార పూజింతురు. ఈకాలమున యువతులు మదనపూజ చేయుట సంప్రదాయము.

"మందమలయానిలార్ద్రి
స్పర్శా త్సుఖశాయినో బహిస్తు జనాః
రాత్రిషు సవాతవృష్టిషు
అంతర్గృహ మావిశంతి సకలకలమ్"

చంద్రిక :— చల్లనిగాలి కపేక్షించి ఇంటివాకిళ్ళలో సుఖముగా నిద్రపోవుజనులు - ఏయర్ధరాత్రివేళనో గాలిదుమారము చెలరేగి నాలుగుచినుకులు పడుచుండ, కలకలరవములతో మంచములు ప్రక్కలు ఎత్తుకొని లోగృహములను ప్రవేశింతురు. స్వభావోక్తి యిది.

"కామోత్సవప్రచలితాద్భుతవారనారీ
నృత్యం, పురే జనకృతా న్వివిధా న్వినోదాన్
సౌధోపరిస్థితసముత్సుకరాట్కుటుంబా
ఉద్వీక్ష్య రాత్రిషు ముదం సురభౌ వహంతి"

చంద్రిక :— ఈవసంతరాత్రులందు నగరములలో జరుపుకొను కామోత్సవపుటూరేగింపులో వేశ్యలు నాట్యగానములను, పౌరులు కత్తిసాము, కఱ్ఱసాము, భజనలు, హాస్యవేషములు ప్రదర్శింతురు. వానినెల్ల రాజకుటుంబములు మేడలపైనుండి చూచి ఆనందించును.

"ప్రత్యబ్దకల్యాణవిరాగశూన్యః
సముత్సుకో రాఘవ ఏకపత్నీమ్
భక్తాక్షిపద్మార్చితపాదకంజాం
భద్రాద్రిరామో భజతీహ సీతామ్"

చంద్రిక :—పతివ్రతామతల్లి యగుసీతను, ఏటేటను అదేపనిగ పెండ్లిచేసికొనుటకు విసుగు చెందక, లక్షలకొలది భక్తులర్పించు నేత్రకమలముల పూజలనడుమ భద్రాద్రి రాముడు ఈకాలమందే మహావైభవముగ కల్యాణము జరుపుకొనుచుండును.

"నూతనచించారసగుడ
చూతయుతం నింబకుసుమకటులేహ్యామ్
అస్వాద్య వికృతలపనః
గుడశకలం యాచతే డింభః"

చంద్రిక :—క్రొత్తగవచ్చిన సంవత్సరాదినాడు, చింతపండుపులుసు - క్రొత్తబెల్లము, వేపపువ్వు, మామిడికాయముక్కలు కలిపి చేసిన "ఉగాదిపచ్చడిని" బాలుడు తిని దాని

చేదునకు తట్టుకొనలేక మొగము చిట్లించుకొని లొట్టలు వేయుచు, నోటితీపికై అమ్మను బెల్లపుముక్క నడుగు చున్నాడు. నింబకుసుమభక్షణ మానాడు ముఖ్యకార్యము.

"అద్వైతాచార్యమందారః జ్ఞానధారావలాహకః
విద్వచ్ఛిష్యోడుపూర్ణేందుః జయ త్వాచార్యశంకరః"

చంద్రిక :— అద్వైతతత్త్వగురువులకు కల్పవృక్షము వంటి – జ్ఞానధారల నొసగుమహామేఘ మైన – పండితశిష్యు లనెడినక్షత్రములలో పూర్ణచంద్రునివంటి ఆచార్యశంకరభగ వత్పాదులు సర్వోత్కర్ష వహింతురుగాక. శంకరజయంతి ఈఋతువున వచ్చును.

"సింధూత్తరణవిమానః
రామకథారత్న మంజనాపుత్రః
సీతాలక్ష్మణజీవిత
దాతా, హనుమాన్ సదా జయతి"

చంద్రిక :— అంతుపంతు లేనిమహాసముద్రమును విమానమువలె లంఘించి సీతాలక్ష్మణులకు-శ్రీరామునివార్త చెప్పియు – సంజీవిని దెచ్చియు ప్రాణములు నిలిపిన అంజనీ పుత్రుడు హనుమంతుడు రామాయణమహాకథకు రత్నము. అతడు వర్ధిల్లుగాక. హనుమజ్జయంతి యీఋతువున వచ్చును.

"జటీ భసితదివ్యాంగో వేదవేత్తా చ తుందిలః
ఆంధ్రసామ్రాజ్యనిర్మాతా విద్యారణ్యో జయత్వలమ్"

చంద్రిక:— మహాజటలు కలవాడు, పెద్దబొజ్జ కలవాడు, ఒడలెల్ల విభూతిరేఖలు గలవాడు, వేదముల కర్థవివరణ మొనర్చినవాడు, ఆంధ్రసామ్రాజ్యమునకు స్థాపకుడు అగు విద్యారణ్యులు సర్వకాలము వర్ధిల్లుదురుగాక. విద్యారణ్య జయంతి యీకాలముననే ప్రజలు జరుపుకొనుచున్నారు.

"మాధవః కామజనకః వనమాలాప్రసాధనః
యుగాది ర్వనితానందవర్ధనోఽవ్యా జ్జగ త్సదా"

చంద్రిక :— కామాధిక్యమును కలిగించుచు, వనవృక్షములను కిసలయఫలపుష్పసమృద్ధిచే నలంకరించుచు, వత్సరమున కాదిపురుషుడై స్త్రీల కానందము కలిగించువసంతుడు జగము నుద్ధరించుగాక - కామునికి తండ్రియై, వనమాలియై, యుగముల కాదిపూరుషుడై, గోపికల కానందమయుడైన శ్రీహరి లోకముల నుద్ధరించుగాక - ఇది మంగళాంతము - ఇందలి పదములన్నియు శ్లేషార్థముగలవి.

ఋతుచర్యాయాం వసన్త స్సమాప్తః



# ఋతుచర్యా

[గ్రీష్మఋతువు - జ్యేష్ఠాషాఢములు]

"పాంథరక్షాపరా జాయా పాంథసంతాపకః పతిః
ఛాయార్కయోశ్చ చెవృత్తం విచిత్రం సుఖదుఃఖదమ్"

చంద్రిక :— సూర్యునిభార్య ఛాయాదేవి. ఛాయ అనగా నీడ అనియు అర్థము. తనభార్య పాంథులను రక్షించు దృష్టి కలదయ్యును తానుమాత్రము వారిని తపింపజేయువాడై యుండుట ఈదంపతుల విచిత్రచర్య. ఇది యీఋతువున జరుగుచుండును. అనగా బాటసారులు ఎండకు నెత్తి మాడి నీడను కోరుచుందురు.

"పద్మచ్ఛత్రం నలినీ
దలకంచుక ముపరి శైవలవ్యజనమ్
భానుకరై స్సంతప్తాః
కుల్యా బిభ్రతి మృనాళవలయాని"

చంద్రిక :—ఈగ్రీష్మమున సూర్యతాపము సహింపలేక చెఱువులు, కొండకాలువలును పద్మమనెడి గొడుగు వేసికొని, తామరాకు లనెడిరైకలు తొడిగి, నాచు అనెడి విసనికఱ్ఱలను చేబట్టి, అప్పటికిని నిలువజాలక చల్లదనమునకై కలువకాడల నొడలంతయు చుట్టుకొన్నవి.

"గ్రీష్మే జాఠరదీప్తేః క్షుద్బాధా, పానభోజనాసక్తిః
శీతలపదార్థరక్తిః క్లిశ్నాతి సదాఽతినీరసో భావః"

చంద్రిక :—ఈకాలమున జఠరాగ్ని మందుచుండుటచే ఆకలిబాధయు, త్రాగవలె, తినవలె ననుకోరికయు, చల్లని పదార్థములపై హితవును గల్గును. ఎడతెగని నీరసభావము బాధించుచుండును.

"స్వేదోద్గమో విదాహ
శ్చాతపతాప స్సమీరదారిద్ర్యమ్
శీతలజలదుర్లభతా
బాధంతే గ్రీష్మసమయజా ధర్మాః"

చంద్రిక :— మిక్కలి చెమట పట్టుట, అతిదాహము, ఎండవేడి, గాలి లేకపోవుట, చల్లనినీరు లభింపకుండుట ఈ ఋతువునందలి ధర్మములు.

"నష్టా మదనాతురతా భ్రష్టా పత్నీప్రరోచనా
ఇష్టా చందనచర్చాచ పుష్టా స్వేదసముద్గతిః"

చంద్రిక :—ఒడళ్ళు తెకతెకలాడుచుండుటచే కామేచ్ఛ నశించును. భార్యలను సంతోషపెట్టుశక్తి పురుషులకు హీనమగును. మంచిగంధపుపూత లిష్టమగును. ముచ్చెమటలు పోయుచుండును.

"వీథీషు రథ్యాసుచ తప్తపాంసుభి
ర్బాలా జానా స్తాపితపాదపద్మాః
చండాతపోద్వేజితశీర్ష కర్పరా
ధావంతి విద్యాలయకాలకర్షితాః"

చంద్రిక :— రోడ్డుబూడిదయు, బాటలందలి యిసుకయు ఎండకు తెగ క్రాగియుండుటచే బడి కేఁగుపిల్లలును, ఒజ్జలును క్రింద అఱకాళ్లుమాఁడి, పైని తలమాడి వేళమించు ననుభయముతో ఈకాలమున పర్వులెత్తుచుందురు.

"గ్రీష్మోష్మణా వ్యాకులితా భుజంగాః
పటీరశైలే బహిరుద్గతా భృశమ్
శైత్యాభిలాషాదివ చందనానాం
మూలాని శాఖా అపి వేష్టయంతి"

చంద్రిక :—గ్రీష్మతాపమున కాగలేక మలయపర్వతమందలి త్రాచుఁబాములు తమబిలములనుండి వెలికివచ్చి, చల్లఁదనము నపేక్షించి కాబోలు అందున్న గందపుచెట్ల మొదళ్లను, కొమ్మలను చుట్టుకొన్నవి.

"శుష్కేషు గ్రీష్మసమయే భువి పల్వలేషు
భీత్యా లుఠంత్యుపరి భేకకుళీరమత్స్యాః
స్నిహ్యంతి కర్దమజలేషు లులాయకోలాః
ధావంత్యహో వనమృగా మృగతృష్ణికాభ్యః"

చంద్రిక :— చెఱువునీరు చాలవఱ కెండిపోగా అందలి కప్పలు, పీతలు, చేపలును ప్రాణభీతిచే స్వల్పజలమందెగిరి పడుచున్నవి. దున్నపోతులును పందులును బురదనీటిలో

పొరలుచున్నవి. జలభ్రాంతి పుట్టించు ఎండమావులకై మృగము లీటునటు పరుగులెత్తుచున్నవి.

"లాలాస్రావిముఖా స్సృగాలశునకా జహ్వాః ప్రసార్యాతురాః
ద్వేధాకృత్య ముఖం విశుష్క, మచరన్ సంతాపితాః పక్షిణః
హంసాః పద్మవనాంత రేషు శయితాః, కచ్ఛస్థలీసంశ్రయాత్
ప్రాణాపాయభయం జహాతి విపినే గ్రీష్మే మృగాణాం కులమ్"

చంద్రిక :— ఈకాలమున నక్కలు కుక్కలును చొంగలతో నోళ్ళు తెఱచి నాల్కలుచాచి ఆతురతచెందు చున్నవి. పక్షులు తాపము చెందుచు ముకుపుటములు తెఱచి సంచరించును. హంసలు పద్మవనములచాటున పరుండును. అడవులలో మృగములగుంపులు జలము గలప్రదేశము లాశ్ర యించి అపాయమును తప్పించుకొనుచున్నవి. శునకాదులకు స్వేదము లాలగా కారుట శాస్త్రోక్తము.

"శేఫాలికావకులపాటలమల్లికాద్య
సేమంతికాగిరిశిరీషసుమప్రభూమా
నారంగచూతపనసాదిఫలాభిరామో
రేజే శుచి స్తపనతాపపరీతసీమా"

చంద్రిక :— నల్లవావిలిపూలు, పొగడపూలు, కలిగొట్టుపూలు,మామిడిపూలు, మల్లికలు, చేమంతులు, కొండగోగుపూలతో కలకలలాడుచు, నారింజ, మామిడి పనసాదిఫలములతో, వేడిగాడ్పులతో నిండినసీమలు గలదై ఈకాలమొప్పును.

"భాండజలం కూపజలం
హైమజలం నారికేడసలిలంవా
చందనమృణాలపల్లవ
ముశీరకంవా జనై రిష్టమ్"

చంద్రిక :—కుండలలో నింపిననీటిని, లోతైన నూతి నీటిని, మంచునీటిని, కొబ్బెరబొండ్లములనీటిని – మంచిగంధమును, తామరతూండ్లను, చివుళ్లను, వట్టివేళ్లగంధమును జనులు మిక్కిలి కోరుదురు.

"పర్ణపూలగృహాంతస్థ సామాన్యానాం నహి వ్యథా
విద్యుచ్చక్రానిలాపూర్ణ సౌధస్థానాంతు దుర్గతిః"

చంద్రిక :—ఆకులపాకలలోను పూరిండ్లయందును నివసించు సామాన్యులు ఎండబాధ లేక హాయిగ నుందురు. విద్యుచ్చక్రములతో (ఫేనులు) కూడిన మేడలపై నివసించువారి కట్టిసౌఖ్య మందదు. ఫేను వేడిగాలులనే ఆకర్షించి విసరి అంగములను శుష్కింపజేయుట ప్రసిద్ధి. డాబాలు ఎండకుకాలి వేడినే చిమ్మును. కాన వారి కాపసోపా లెక్కువగనుండును.

"పదేపదే జలై రార్ద్రీకృతా శ్శ్చశీరకాః కటాః
గృహద్వారేషు లంబంతే శుష్కా ఆతపతాపితాః"

చంద్రిక :— గృహద్వారములందు చల్లదనముకై వ్రేలాడగట్టబడి వడగాడ్పుల కెండి యెండిన వట్టివేళ్ల చాపలు మాటిమాటికి తడుప బడుచుండును.

"సంక్రాంతరోహిణీకార్క తాపాత్ చటకశారికాః
ఆలవాలజలం గత్వా పిబంతి స్నాంతి యాంతిచ"

చంద్రిక .— రోహిణీకార్తియందలి సూర్యతాపమును సైపజాలక, పిచ్చుకలు గోరువంకలును, పాదులకు పిల్లలు పోయు నీటిని సమీపించి - కొంతనీటిని త్రాగి, అందే దేహములనుతడిపికొని ఎగిరిపోవుచుండును. "సేకాంతే మునికన్యాభిః-విహంగానా మాలవాలాంబుపాయినామ్" అని కాళిదాసు అన్నాడు.

"రథ్యాప్రపాపాలికయా సలీల
మాలోకితోఽసౌ పథిక స్సతృష్ణః
తదాస్యచంద్రాధరనిర్గలత్సుధా
సమం జలం సాంజలి రాపపౌ యువా"

చంద్రిక :— మార్గమధ్యమందుండుచలివెందరను (బాటసారులకు మంచినీటి నొసగుపాక) నడపుచున్న పడుచు పిల్ల, కొంటెచూపులు చూడగా దారిని బోవుయువకపథికుడు దాహము కలవాడై (యువతిపై ఆశకలిగి) దానిచందురుని బోలు ముఖమునుండియు అధరమునుండియు స్రవించు అమృతముతోపాటు, ఆమెపోయు చల్లనినీటిని త్రాగెను.

"ఝంఝాతితీవ్రవేగా
త్సాయం నిభృతం ప్రకంపితా లులితా
ప్రసవానంతరదుర్బల
తరుణీతౌల్యం ప్రకృతి రుపయాతి"

చంద్రిక :— తరచు సాయంసమయములందు విసరెడి వానతో గూడిన సుడిగాలులచే ప్రకృతికాంత అటునిటు గుంజి వేయబడినదై శాంతించిన వెనుక ఆప్రకృతిశోభ ప్రసవించిన బాలెంతను పోలియున్నది. పగలంతయు మిక్కిలి యుక్క పెట్టి సాయంకాలములందు గాలులు రేగి నాలుగు చినుకులు పడుట జరుగుచుండును.

"పాదగాత్రశిరోనేత్రత్రాణైః ఛత్రైశ్చ చామరైః
గతాగతం కర్తుమపి జనః క్లిశ్నాతి చాతపే"

చంద్రిక :—పాదరక్షలు తొడిగి, చొక్కాలు ధరించి, తలకు టోపి పెట్టి, కన్నులకు చలువ అద్దములు తాల్చి, సర్వాంగరక్షకై మరల గొడుగు, విసనికఱ్ఱను పట్టి నడుచుటకైన నరులు బాధ చెందుదురు. ఈకాలపుగాడ్పు లట్టివి.

"జలపూర్ణ గృహకటాహం
సోత్కంఠో బాలక స్సముద్వీక్ష్య
కరతాడనైః ప్రవికిరన్
జల, మంగా న్యార్ద్రితాం నయతి"

చంద్రిక :— నీటితో నిండియున్న ఇంటిలోని పెద్ద 'డేగిసా, ను చూచి - ఎండవేడిమికి తాళలేని బాలకుడు చరచర ప్రాకిపోయి దానిని సమీపించి రెండు చేతులతో ఆ నీటిని తపతప కొట్టుచు, చెదరిననీటిచే తన అంగములను చల్లపఱచుకొనుచున్నాడు. ఇది స్వభావోక్తి.

"మద్యపానమదఘూర్ణిత నేత్రా
అవ్యవస్థితపదైః ప్రలపంతః
నిర్ణిరోధగమనా హ్యనుసాయం
చక్రు రత్ర కితవాః పురి ధూర్తాః"

చంద్రిక :— తెగత్రాగిన మద్యముచే కన్ను మిన్నులు కాననివారై, తొట్రుపడుచున్న అడుగులు మాటలును కలవారై, నోటికి వచ్చినటులు వదరుచు, పురమందు ప్రతిసాయం సమయములందును జూదగాండ్రు, రౌడీలును నిరంకుశముగ నడకలు సాగింతురు.

"రోహిణీసహితో మిత్ర స్సానందో భువి దంపతీ
బహి ర్నిష్కాసయన్ వ్యష్ట్యా స్వేదోష్మాభ్యాం ప్రబాధతే"

చంద్రిక :— రోహిణితో కూడి ఆనందము ననుభవించుచున్న సూర్యభగవానుడు లోకమందలి దంపతులనుమాత్రము విడదీసి, ఇంటివెలుపలికి వెడలగొట్టి ఉక్కయు చెమటలు కలిగించి బాధించును. అనగా దంపతులు ఉక్కపోత భరింపలేక ఆరుబైట విడివిడిగ పరుందురు – రోహిణికార్తి సూచితము.

"వనే శయిత్వా పరివృత్య రమ్యం
బహిర్ముఖం స్వస్థధియః కురంగాః
రోమంథయుక్తా శ్చకితేక్షణాశ్చ
స్వల్పేఽపి శబ్దేసతి విద్రవంతి"

చంద్రిక :— వనములందు లేడిగుంపులు మోములు వెలుపలికి పెట్టి గుండ్రముగ పరుండి చంచలదృష్టులతో నెమర్లు వేయుచుండును. ఏవైపుననుండి ఏమాత్రపుసవ్వడి వినిపించినను దిగ్గున అన్నియు ఒక్కసారిగ లేచి విడిచినబాణ ములవలె పర్వులెత్తును.

"వియద్రత్నాకరా త్తూర్ణం బహిః క్షిప్తా భవన్తా క్తికాః
కోరకచ్ఛద్మనా మల్లీకుంజా నాశ్రిత్య రేజిరే"

చంద్రిక :— ఆకాశమను రత్నాకరమునుండి వెలు పలికి చిమ్మబడిన రిక్కలనెడి ముత్యములు మొగ్గలనెపమున మల్లిపొదల నాశ్రయించి ప్రకాశించినవి.

"యువతీశిరోవిభూషిత
కుందస్రక్పరిమలా క్తమకరందః
కచభృంగసంగబాధాం
నహి ముంచత్యపి నిశాసు సర్వాసు"

చంద్రిక :— రాత్రులందు స్త్రీలు జడలలో జాజి మల్లెలదండలు ధరింతురు. ఆ పూలలోని పరిమల మిలితమక రందమును త్రాపుటకొఱకు, వారి కేశము లనెడినల్లని గండు తుమ్మెదలు రాత్రులందుగూడ ముసరుచు బాధించుచున్న ట్లుండెనని యూహ. ఇందు కేశజాలము తుమ్మెదలుగా రూపింపబడినది.

"మల్లికుసుమాపచయే
తరుణీ దష్టా మధువ్రతేన ధూర్తేన
ఆశ్లేషే దృష్ట్వా క్షతి
మాశంకాం భజతి ప్రియతమః తస్యామ్"

చంద్రిక :— ఒకపడుచు అలంకరించుకొనుటకై మల్లి పూలను కోసికొనుచుండగా పుష్పరసము గ్రోలుచున్న తుమ్మెద చెదరి ఆమెపెదవిపై కాటు వేసెను. రాత్రి ప్రేమతో కౌఁగిలించినపతి ఆక్షతిని జూచి ఆమె ననుమానించెను.

"చండవాత్యా సముద్ధూత ధూలిపాతార్ద్రదృష్టయః
చపలాక్ష్యో భవంతీహ చంచలాక్ష్యః పదే పదే"

చంద్రిక :— విసరుచున్న సుడిగాలులచే ఎగురగొట్ట బడిన ధూళి పడుటచే కన్నీరు గలిగి తడిసినదృష్టులు గల చపలాక్షులు (స్త్రీలు) చంచలమైన చూపులు గలవారై మాటిమాటికి చంచలాక్షు లైరి. స్త్రీలు చంచలాక్షులు.

"నియతాహారవిహారా
నియతేంద్రియనిర్వికల్పసత్తపసః
యతయశ్శుచౌ చరంతిహి
చాతుర్మాస్యవ్రతం శుచయః"

చంద్రిక :— నియతమైన భుక్తియు సంచారమును గలవారై, ఇంద్రియముల నరికట్టి తపస్సు చేసికొనుసన్యాసు

లీ కాలమున పరిశుద్ధులై నాలుగునెలలు ప్రచారములుమాని వర్తింతురు. దీనినే చాతుర్మాస్యవ్రత మందురు.

"మృతకౌరవసర్వయోధవర్గాన్
గురుణా యోగబలేన ధర్శయన్
కురువృద్ధ మతర్పయన్ మహా
కవిరాట్ వ్యాసముని ర్జయ త్వలమ్"

చంద్రిక :— భారతయుద్ధమున మరణించిన తన పుత్రపౌత్రులను మహాయోధులను ఒక్కసారి చూపింపు మని ధృతరాష్ట్రు డడుగగా, తన యోగబలముచే వారినెల్ల నతనికి దృష్టి నొసంగి చూపి మహానందము గూర్చిన – మహాకవియైన మునిముఖ్యుడు వ్యాసుడు వర్ధిల్లుగాక. అనగా వ్యాస జయంతి ఈఋతువున వచ్చును.

"భక్తకోటికరాకృష్టరథప్రగ్రహనిగ్రహః
దారుమూర్తిః జగన్నాథో రథవాహ్యాలి మృచ్ఛతి"

చంద్రిక .— జాతిమతభేదములు విడిచి లక్షలకొలది భక్తులు పగ్గములు చేబట్టి లాగుచుండగా జగన్నాథస్వామి బలరామసుభద్రలతో మహారథము నెక్కి నగరసంచార మొనర్చును. జగన్నాథరథోత్సవ మీకాలమున జరుగును.

ఋతుచర్యాయాం గ్రీష్మఋతు స్సమాప్తః



# ఋతు చర్యా

వర్షర్తువు - శ్రావణ భాద్రపదములు

"పతంగికానాం దివి వల్గనాని
మహేంద్రచాపోదయ మింద్రగోపాన్
మహాబ్ధిఘోషం పరివేష రేఖాం
వర్షస్య లింగాని వదంతి సంతః"

చంద్రిక :— ఆకసమందు తూనీగ లెగురుట, ఇంద్ర ధనుస్సు మేఘములపై కనుపించుట, ఆర్ద్రపురుగులు భూమిపై గుమిగూడుట, సముద్రము హోరు పెట్టుట, చంద్రమండలమును చుట్టి పరిధి కనపడుట, ఇవి వర్ష చిహ్నములుగా శాస్త్రప్రసిద్ధి.

"జఠరాగ్నే ర్మందత్వం
కవోష్ణపానీయభోజనాసక్తిః
కృత్యే ష్వౌదాసీన్యం
నిద్రాసక్తి స్సదా వార్షే"

చంద్రిక :— జీర్ణశక్తి తగ్గును. గోరువెచ్చని పానీయ-భోజనపదార్థములం దాసక్తి కలుగును. పనులుచేయుటయందు బద్ధకము, నిద్రింపవలెననెడి వాంఛయు ప్రబలు కాలమిది.

"అహర్నిశం నీలపయోధరాణా
మాక్రాంతిహేతో ర్దివి సూర్యచంద్రౌ
కారానిబద్ధావివ సంచరంతౌ
అదృశ్యతాం ప్రావృషి సంప్రయాతౌ"

చంద్రిక :— రాత్రింబవళ్లు నల్లనిమేఘము లాకసము నావరించి యుండుటచే నీకాలమున సూర్యచంద్రులు కారాగారమం దిడినవారివలె తఱచుగ జనములదృష్టికి కానరాకుందురు. అనగా "మేఘచ్ఛన్నేఒహ్ని దుర్దినం" అను శాస్త్రిముచే ఈకాలమున దుర్దినము లధిక మని ధ్వనితము.

"ప్రథమోదబిందుపతనా
త్సురభీకృత సర్వదిగ్వలయా
భూకాంతా గ్రీష్మోష్మం
ప్రోషితపతికేవ నిశ్వసితి దీర్ఘమ్"

చంద్రిక :—వేసవియెండల తప్తమైన భూమియనెడి రమణి, మొదటిసారిగ చల్లనిమేఘోదబిందువులు తనపై పడగానే (చిత్రివృష్టి పడినంతనే) ఒకవిధమైన పరిమళముతో, ఆవిరి యనువేడినిట్టూర్పులను విడుచును. ప్రవాసమం దున్న పతిగలనాయికయు మదనార్తమై తపించి తపించి దీర్ఘనిశ్వాసములు విడుచుట ప్రసిద్ధము. ఆమెతో భూమికి పోలిక.

"జీవనభారం ధృత్వా
యోనోన్ముఖపాంథసంఘఇవ మేఘాః
గర్జాసంకులవచనై
ర్విద్యుద్దీపైః ప్రయాంతీమే"

చంద్రిక :— నీటితోనిండి, ఉరుములనెడి మాటలను చెప్పకొనుచు, మెరపు లనెడి దీపములతో మొయిలుగములు

ఈ కాలమున కదలుచుండును. దారిలో తినుటకు పదార్థము లను మూటలుగట్టి మోయుచు, మంచినీటిని దప్పిగలిగినపుడు త్రాగుటకై గ్రహించి వెలుగుకై కరదీపికలను పూని, సందడిగ మాటలాడుకొనుచు రాత్రుల పయనించు వర్తకసంఘము నవి పోలెను. ఇందు, జీవన, శబ్దము శ్లిష్టము.

"మహానట సమారబ్ధ జగద్విలయతాండవే
ఢక్కానాదాఇవ ముహుః గర్జంతి స్తనయిత్నవః"

చంద్రిక :— నటశేఖరుడైనశివుడు ప్రళయకాలమున తాండవము చేయునట. నాట్యావసానమం దతడు ఢక్కను మ్రోయించును. దాని ధ్వనులనుబోలి ఈ కాలపు మేఘములు మాటిమాటికి ఉఱుముచుండెను. ఇందుకు :—

"నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం" అని ప్రమాణము.

"ప్రసరత్తార్తీయాక
విలోచనవహ్ని ప్రభేవ భర్గస్య
గర్జత్పర్జన్యానా
ముపర్యుపరి చంచలా చలతి"

చంద్రిక — శివునియొక్క తెఱచిన మూడవకంటి నుండి మండిపడు అగ్నికాంతులవలె ఉఱుముచున్న మేఘముల పైపై నుండి మెఱుపులు ప్రకాశించును.

"కుంభినీ బహులవర్ష జలార్ద్రా
శీతలానిలకథా మవిషహ్యా
మేఘనష్ట తపనాతపభావాత్
శాద్వలద్విపటికాంతరితాఽభూత్"

చంద్రిక :— ఎడతెఱపిలేని వర్షములచే భూదేవి బాగుగ తడిసి ముద్దయి, చలిబాధకు తాళజాలక, ఎండలో తన దేహమును వెచ్చచేసికొనుటకైనను, తపనుడు మేఘములచే కప్పబడియుండుటచే నట్టియెండవేడియు లేక, పచ్చికపట్లనెడి పచ్చడమును (రగ్గును) కప్పుకొన్నది. భూమి పచ్చికతో నిండిన దనిభావము.

"తటిదంకుశైః ప్రవిద్ధా
జీమూతమతంగజాస్తు గర్జంతః
మదజలధారాసారం
వర్షంతఇవ స్థితా నభసి"

చంద్రిక :— నల్లనిమేఘములనెడి మదగజములు, కాలపురుషుడు మెఱుపులనెడి పదనైనఅంకుశములచే పొడువగా, మొఱ్ఱోమని ఉఱుములనెడి ఘీంకృతులు చేయుచు వర్షోదక మను మదజలమును రాల్చుచున్నట్లుండెను.

"గుహాంతస్థ నిరాహారసింహో గర్జాకరాలదృక్
మేఘాన్వీక్ష్య గజభ్రాంత్యా చిరముత్పత తీర్ష్యయా"

చంద్రిక :— కొండగుహలో తిండిలేక నివసించు సింహము, మేఘములను గాంచి వానిని మదగజములనుకొని గర్జించుచు భీకరదృక్కులను పచరించుచు వానిమీాదికి లంఘించుచున్నది.

"ఆసారేపి బహిః స్థిత్వా బంధే, శీతా దనాతురాః
నిశ్చలాశ్చ సరోమంధా మహిషాః ప్రీతి మాయయుః"

చంద్రిక :—బోరుబోరున ధారలతో వాన కురియుచున్నను బయట కట్రాటను బంధింపబడి తడియుచు, ఏపాటి చలిబాధయు లేక, కదలక మెదలక నిలుచుండి నెమరులు వేయుచు గేదెలు దున్నలు మహాసుఖ మందుచుండును.

"గర్జామృదంగరవ మద్భుత మాకలయ్య
ఆసారవృష్టిరవగాన మనుప్రవిష్టః
అశ్రిత్య చోన్నతవిచిత్రనగాగ్రరంగం
కేకే నటీవ నటతీహ విసార్య బర్హమ్"

చంద్రిక :— వర్షపాతసమయమున గలుగుధ్వనియే గానముగా, ఉరుములు మద్దెలలరవములుగా, పలురంగులు గలకొండకోన యనెడి రంగస్థలముపై - పూలతో నిండిన వృక్షాగ్రముపై - నెమలి తనపింఛమును విప్పి - పింఛమును కట్టుకొని నాట్య మాడునటివలె, నటనమును ప్రదర్శించెను. ఇట, నగ శబ్దము శ్లిష్టము.

"తృణగేహోపరి వర్షో
దకణా భాంతి క్రమేణ నిపతంతః
జీమూతగలితనిర్మల
ముక్తారూపానుకారిణో వార్షే"

చంద్రిక :— రెల్లుగడ్డితో నేయబడిన యిండ్లకప్పుల నుండి జారిజారి క్రమక్రమముగా క్రిందపడు వర్షబిందువులు మేఘములనుండి జారిన స్వచ్ఛమైన ముత్యములవలె తోచును. "కరీంద్రజీమూతవరాహశంఖ శుక్త్యహి వేణూద్భవజాని లోకే ముక్తాఫలాని ప్రథితాని" అను శాస్త్రమునుబట్టి ముత్యములు మేఘములనుండియు పుట్టును.

"మాలతీకుటజకేతకీలతా
బంధుజీవకకదంబకదంబాః
గ్రీష్మతాప మపనీయ పల్లవైః
కోరకైశ్చ కుసుమై ర్విరేజిరే"

చంద్రిక :— గిరిమల్లికలు, మాలతీలతలు, మొగలి, కడిమి, మంకెనలు గ్రీష్మతాపమును విడిచి చిగిర్చి మొగ్గలు, తొడిగి పుష్పించినవి.

"క్షుద్రభేకాః ప్రమంహూకాః పూర్ణజీవనసంభవాత్
వివిధస్వరసంయుక్తా జగర్జుః కర్ణకర్కశమ్"

చంద్రిక :— బోదురుకప్పలు, చిన్నచిన్న మండూక
ములు, తమకు పూర్తియగు జీవనము (నీరు) లభించుటచే
వివిధములైన స్వరములతో చెవులు బ్రద్దలగునటులు రాత్రు
లందు కూయుచుండును.

"మహీరజః కర్దమతా మవాప
నిరస్తతాపార్తి రభూ దనంతా
ప్రవాహయానైః పరిసంగమయ్య
సిషేవిరే సింధుపతింహి నద్యః"

చంద్రిక :— వర్షములకు తడిసి భూమిపైనుండు దుమ్ము
బురదగ మారెను. వేసవికి కాలిన భూమి తనతాపమును పోగొ
ట్టుకొనెను. నదులు తమపతి యగు సముద్రుని చేరుకుతూహల
ముతో ప్రవాహవేగము లనెడి పరుగు లెత్తుచు, ఆతనిని
కలిసి సేవించినవి - నదులు సంద్రములో కలియుట ఉప
మింపబడినది.

"ఆపూర్య వేత్రపుటికాం
చంపకచాంపేయకేతకీకుసుమైః
విచరంత్యా స్సుమలావ్యాః
పరిమలలహరీం వితన్వతే వీథ్యామ్"

చంద్రిక :— పూలసజ్జ నిండ సంపెగలు, నాగకేసర
పుష్పములు, మొగలిపూలు, మల్లెలు, మొల్లలు పోసికొని

పూవుల నమ్మెడి యువతులు వీధులంట తిరుగుచు ఒకపరిమల ప్రవాహమును ప్రవహింపచేయుచున్నారు, పుష్పలావికలు పువ్వులమ్ముచుండి రనిభావము.

"రథ్యాతలప్రసరదంబుని సంభవంతః
దేహాస్థిరత్వ మనుభూయ నివేదయంతః
కాంత్యాతు కాచగుళికాఇవ భాసమానా
వర్షాసు బుద్బుదగణాః ప్రచరంతి మందమ్"

చంద్రిక :— బాటలయందు ప్రవహించు నీటియందు పుట్టుచు, తమ స్వరూపనాశనముచే జీవులదేహములును అశాశ్వతము లనిబోధించుచు, గాజుగోళీలవలె నిగనిగలాడు బుడగలు నెమ్మదిగ నడచిపోవుచున్నటుల్ లీకాలమున కన్నులపండువొనర్చును. జీవితము బుద్బుదప్రాయ మని నానుడి.

"వార్షుకజలకణపానే
చంచూ రుద్ఘాట్య చాతకా వియతి
విచరంతి; ప్రాప్తావా
నోవా ? త్రైర్బిందవో ద్విత్రాః"

చంద్రిక :— వర్షించు మేఘజలబిందువులను త్రావుటకై ఆకసమున నోళ్ళు తెరచి యెగురుచున్న చాతకపక్షులకు రెండుమూడు బిందువులైనను వానిజిహ్వల కందినవో లేదో! చాతకములు భూమిపై బడినీటిని ముట్టవు. వర్ష బిందువులే త్రాగి యుండును. "సర్వంసహాపతితమంబున చాతకానామ్"

"రాత్రౌ చిరరతిశ్రాంతయూనో రేకత్ర శాయినోః
కంబల్యంతస్థయో ర్వర్షే దివాప్యత్ర నిశాయతే"

చంద్రిక :— రాత్రియందు సంభోగసౌఖ్యము ననుభవించి, ఆ నీరసభావముతో దగ్గరగఁజేరి రత్నకంబలము కప్పుకొని పరున్నయువకులకు, తెల్లవారి ప్రొద్దెక్కినను మెలకువ రాకుండెను. కాన వారికి పగలుకూడ రాత్రివలెనే యైనది. రాత్రి నిద్రచాలక పగటియందును గాఢనిద్రలో మున్గిరి.

"గర్భస్థతల్ప చలనాఽసహమానభావాః
కాశ్మీరచేలకలితా మృదుతల్పభాజః
శీతోష్ణరోధకగృహాంతరగాఢనిద్రా
వర్షానిశా స్సుఖతరం ధనినో నయంతి"

చంద్రిక ;— కడుపులందలి చల్లకదలకుండ "ఎయిర్ ఖండిషన్ రూములలో" కాశ్మీరపుసాలువులు కప్పికొని మెత్తని పఱుపులపై శయనించి ధనికు లీ వర్షకాలపురాత్రులను సుఖనిద్రలతో గడుపుచుందురు.

"ఝంఝాప్రభంజనోద్విగ్నాః కంపితాంగా నిరాశ్రయాః
భిక్షుకా స్సంచరం త్యన్నపానదూరా అహర్నిశమ్"

చంద్రిక :— ఈదరగాలులకు వణంకుచు, తడిసినబట్టలతో - అన్నము పానీయములు గూడ లేని - ఆశ్రయము లేని భిక్షుకులు రాత్రింబవళ్ళు తిండికై తిరుగుచుందురు.

"శీతబాధానివృత్త్యర్థం దేహోపరి హసంతికాః
ఖట్వాధస్థహసంతీకాః స్థవిరా శ్శేరతే నిశి"

చంద్రిక :— చలిబాధకు తట్టుకొనలేక దళసరిదుప్పట్లను కప్పుకొని, మంచములక్రింద నిప్పుగల కుంపటులను బెట్టుకొని ఆ వెట్టకు వృద్ధులు రాత్రులందు హాయిగ శయనింతురు.

"ఝంఝానిశ్వాసా, బక
రుండస్రక్, మేఘవసనధారాయుక్తా,
విద్యుద్దాసా, గర్జో
పేతా యక్షీవ ప్రావృ డతితీవ్రా"

చంద్రిక :— బోరుగాలివంటి శ్వాసలను విడుచుచు, కొంగవరుసలనెడి పుఱ్ఱెలమాలను ధరించి, మేఘములనెడి నల్ల బట్టను కట్టి, జలధార అనెడి ఖడ్గధారను పూని, మెఱుపుల వలె వికారపునవ్వులు నవ్వుచు, ఉఱుము లనెడి గర్జనలు చేయుచు, అతితీవ్రతగల వర్షకాల మొకమహాభూతమే.

"వనదాహం, భూతాపం
లతావిశోషం జలాపహరణంచ
కృత్వా క్వగతో రవిరితి
మృగయంతీవాంబుదా స్తటిద్దీపైః"

చంద్రిక :— అడవులను (వేసవిని అడవులు తటుచు కార్చిచ్చునకు గురియగును) భూమిని కాల్చి దహింపచేసి,

తీగల నెండించి, జలము నపహరించి ఇన్ని తప్పులుచేసి 'పరారీ' అయిన సూర్యుడను నేరస్థుడు ఎక్కడ దొరకునా యని మేఘభటులు మెఱపుదీపముల వెలుగున పట్టుకొన వెదకుచున్నారు

"ఆర్ద్రేంధనసంయోగా
దుద్ధానం వహతి ధూమమేవ సదా
కాంతా నేత్రజలాంతా
పతినిందాపూర్వకం పచతి"

చంద్రిక :— ఈ ఋతువున వర్షాధిక్యముచే తడిసిన కట్టెలే పొయిలోనికి లభించును. అట్టికట్టెల నంటించుటచే పొయ్యి పొగబారునేకాని చక్కగ మండదు. పాపము ఇల్లాలు, ఆ పొగచే మంటలెక్క కన్నులనుండి నీరు గార్చుచు "తడిపుల్లలు తెచ్చి నా మొహాన్ని పడవేసినారు. వంట ఎల్లా చేసేది ?" అని విసుగుకొనుచు వంటను చేయుచున్నది.

"వినమ్రశాలిప్రసవం జలౌఘే
నిమజ్జయన్ కర్షకహర్షలోపి
లతాకుటీవృక్షకజీర్ణభిత్తీ
స్సంపాతయన్ వర్షఋతు శ్చకాస్తి"

చంద్రిక :—గింజలబరువుచే వెన్నులు వంగినవరిపైరును నీట ముంచి రైతులఆనందమును చెడగొట్టుచు, పూలతీగలను,

పూరిపాకలను, చెట్లను పాతగోడలను కూల్చునదై ఈఋతువు దేశనష్టము కలిగించును.

"యానచక్రసముత్ క్షిప్తం పథి వారి సకర్దమం
పాంథవస్త్రముఖై స్సంఖ్యం కురుతే జలదాగమే"

చంద్రిక :— బాటలపల్లములందలి బురదనీరు "కారుల, బస్సుల" చక్రములచే చిమ్మబడి బాటసారుల వస్త్రములపై మోములపై బడుచుండును.

"ఏకస్య చైకవారం
జీవం దత్వా మృతోపి యక్షేశః
ఇత్యసకృత్స ర్వేభ్యో
ప్యమృతా యచ్ఛంతి జీవనాని ఘనాః"

చంద్రిక :— జీమూతవాహను డనుయక్షుడు ఒకని గూర్చి మాత్రమే, ఒక్కమారే తనజీవితము నొసగి మరణించి నాడు. మనప్రభువుగారిని మనము మించవలె ననుఆశతో - ఆతనివాహనములైనమేఘములు, మరణింపనివై, మాటి మాటికిని- సర్వజనులకును జీవనములు(నీళ్లను)ఇచ్చుచున్నవి. ఇట జీమూతవాహనుఁడు నాగకుమారుని బ్రతికించుటకై తన దేహమును గరుత్మంతునికాహారముగ ఇచ్చుట సూచితము.

"వేదానాం క్రమఘనవాచనప్రవీణాన్
బ్రహ్మజ్ఞాన్ శ్రుతిమహతస్త్రిలింగవిప్రాన్
సంభావ్య ద్రవిణసమర్పణాత్ గృహస్థాః
శ్రావణ్యామతిశయధన్యతామవాపుః"

చంద్రిక :—శ్రావణమాసమున వేదవేత్తలు శ్రావణికి పలునగరగ్రామములు తిరిగి వేదపరిషత్తులచేతను,గృహస్థుల చేతను పూజింపబడి వేదోక్తాశీస్సులు పలుకుదురు.వారి వేదోచ్చారణము శ్రోత్రానందముగ నుండును.వారిని సత్కరించి పలువురు ధన్యు లగుదురు.

"చరదామ్నాయభాండారాః శ్రౌతస్మార్తక్రియాంకురాః
కుర్వంతి శ్రావణీయాత్రాం విప్రాః పావయితుం జనాన్"

చంద్రిక;—తిరుగుచున్న భాండాగారములవంటివీరు వేద ధనమును భద్రపరచిన ధన్యులు.శ్రౌతస్మార్తకర్మలకు విత్తనాల వంటివారు. అట్టివిప్రోత్తములు జనులను పవిత్రముచేయుటకై ఈశ్రావణియాత్రను చేయుచుందురు.

"కవిం కవీనామపి వక్రతుండః
లంబోదరో ప్యగ్రగణప్రచండః
దేవాగ్రసేవ్యో నగజాగ్రసూనుః
సంపూజ్యతే విఘ్నతమిస్రభానుః"

చంద్రిక :— వంకరనోరు గలవాడైనను,అతడు కవులలో మహాకవి.వ్రేలుబొజ్జ కలవాడైనను శివునిగణములలో ముఖ్యుడు.అనగా గణపతి.సమస్తదేవతలకును ముందే పూజింపదగినవాడు.విఘ్నము లనెడిచీకటులకు సూర్యునివంటివా డగు పార్వతీప్రథమపుత్రుడు సిద్ధివినాయకు డీబుతువునందు సకల

జనులచే పూజింపబడును.అనగా వినాయకచతుర్థి యీఋతువున వచ్చును.వంకరదనోరివాడు మహాకవియు-వ్రేలాడుబొజ్జకలవాడు సేనానాయకుడును అగుట విచిత్రము.

"పుష్పాక్షతకుంకుమతాం
బూలాద్యై ర్నవవధూ రద్య
వరలక్ష్మీపూజార్థం
త్వరయతిహి పురోహితం సుముఖి"

చంద్రిక :— పూవులు, అక్షతలు, కుంకుమ, గంధము, తాంబూలాదులను సమకూర్చుకొని,క్రొత్తగ పెండ్లియైనవధువు, వరలక్ష్మిని సేవించుటకై పురోహితుని తొందరపెట్టుచున్నది సౌభాగ్యముకోరిస్త్రీలు వరలక్ష్మీపూజ నీఋతువులో చేతురు.

"సహస్రగోపీహృదయాబ్జభృంగః
తన్నేత్రనీలోత్పలపూజితాంగః
యోగీశ్వర స్సర్వ సురైకగణ్యః
కృష్ణో జయత్వద్య జగచ్ఛరణ్యః"

చంద్రిక :— వేలకొలది గోపికల మనఃపద్మములకు తుమ్మెదయైన-వారి కన్నుకలువలచే పూజింపబడిన దేహముగల-దేవతలలో సంపూర్ణదైవతాంశకల - యోగవిద్యాగురువైన - సర్వలోకరక్షకుడు కృష్ణుడు జగజ్జేగీయమానుడుగదా! అనగాశ్రీకృష్ణజయంతి ఈకాలమున జరుపుకొందురు.

"దాతృత్వగర్వగురుపర్వతకూటకోటి
మారూఢ మాత్తయశసం బలిసార్వభౌమమ్.
త్రైవిక్రమక్రమపరః ప్రశశాస సమ్యక్
సోఽయం వటుర్జయతు వామనరూపధారీ"

చంద్రిక :—నేనే మహాదాత ననెడిగర్వపర్వతశిఖరము నెక్కి ప్రపంచవ్యాప్తమైనకీర్తిని సంపాదించుకొన్న బలిచక్రవర్తిని-మూడడుగులు భూమిని యాచించి,త్రివిక్రమమూర్తియై యణంచిన వామనమూర్తి జయమందుగాక.అనగా వామన జయంతి యీకాలమున జరుపుకొందురు.అతిగర్వితుల పొగరు నణంచి "అతి సర్వత్ర వర్జయేత్"అనునీతిని నిలుపుట దైవ విధి గదా !

ఋతుచర్యాయాం వర్షర్తు స్సమాప్తః



# ఋ తు చ ర్యా

శరదృతువు — ఆశ్వయుజ — కార్తికములు.

"రోలంబకలితకైరవ
సప్తచ్ఛదవారిరుహాసుమోల్లాసా
భ్రమరశుకగీతవాగ్భి
ర్మధురా శర దవతతార సానందమ్"

చంద్రిక :— ఎఱ్ఱకలువలు, పద్మములు, అనటిపూవులు, తుమ్మెదలతో నొప్పుచుండ, భ్రమరగానముతో చిలుకలపలుకులతో ఆనందముగ మధురమైన శరదృతువు వచ్చెను.

"శుభ్రజ్యోత్స్నాధౌతవాసోవసానా
పంకాపేతప్రాధ్వసీమంతవీథీ
సంఫుల్లాబ్జం నీర మచ్ఛం దధానా
రేజే భూమి శ్శాలిసస్యౌఘపూర్ణా"

చంద్రిక :— తెల్లని వెన్నెలచీరను కట్టుకొని, బురద లింకిపోయి ఏర్పడినదారులే పాపటవలె ఒప్పుచుండ, వికసించిన తామరలతో ముత్తెములవంటినీరు కలదై, వరిమళ్లతో నిండినదై భూమి ప్రకాశించెను.

"పులినకటితటేభ్య స్రస్తసత్కాశపుష్ప
ప్రకటధవలచీరా మందమందం చరంత్యః
అతిచరకృశమధ్యాః పూర్ణ శాంతోర్మివల్యః
శరది మనసిజార్తా నిమ్నగా రేజిరే వా"

చంద్రిక :— ఇసుకతిన్నె లనెడికటిప్రదేశములనుండి తొలగిన, తెల్లుబువ్వ లనెడిచీరలు గలవై, మందగమనములతో, తామరకాడలవలె చిక్కిన నడుములతో తరంగములవంటి కడుపునందలిముడుతలు తగ్గి,మదనతాపము గల వనితలవలె ఈకాలమున నదు లొప్పెను. అనగా నదులు సన్నగిల్లెను.

"తారకామధురచంద్రమండలం
శుభ్రమేఘశకలై రలంకృతమ్
నిస్తరంగపరిపూర్ణ సింధువ
ద్రాజతే గగన మాత్తనీలిమ"

చంద్రిక :— ఈకాలమున ఆకసము చంద్రునిచే రిక్కలచే మిక్కిలి ప్రకాశించునదై, తెల్లని మేఘశకలములచే అలంకరింపబడి, తరంగములు లేనిపున్నమనాటి సంద్రమువలె, మిక్కిలి నైల్యము గలదై యొప్పెను.

"దూర్వాంకురాగ్రేషు విచిత్రలూతా
గృహేష్వపి న్యాసితహైమబిందుః
సా వక్రరేఖాకృతసర్వసింధూ
రేజే శర త్సర్వజనైకబంధుః"

చంద్రిక :— గఱికగడ్డిపోచలకొనలయందు, చిత్రచిత్రములైనసాలెపురుగుల గూండ్లపైని మంచుబిందువుల నుంచుచు, ఇంకిన నీటివలన నదులు లావుచెడి మిక్కిలి వంకరలై యుండ జనులకు బంధువై శరత్తు ప్రకాశించెను.

"భిత్వా సుమకోశానలి
మలిమ్లుచో మధుధనాపహారణేన
అనుభవతి పద్మకోశే
కారాశిక్షాం నిశి రుద న్నంతః"

చంద్రిక :—తుమ్మెద అనెడిగజదొంగ పుష్పకోశము లను పగులగొట్టి (కోశ మనగా ధనాగార మని యర్థాంతరము) మకరంద మనెడిధనము నపహరించుటచే తామరమొగ్గ యను కారాగారమందు చిక్కి రాత్రియంతయు మూల్గుచు కష్టదశ ననుభవించెను. పద్మములయందు తుమ్మెదలు వాలుట-ఇంతలో సాయంకాల మగుట,ఆపద్మము ముకులించుట-అందాతుమ్మెద లుండిపోవుట, తెలవారగనే మరల పైకివచ్చుట ప్రసిద్ధము.

"కందర్పదుర్విదగ్ధ
శరై రావిద్ధఇవ ని స్త్రప స్సూర్యః
వ్రీడాఽనభిజ్ఞజఘనం
కన్యారాశిం కదర్థయతి"

చంద్రిక :—ధూర్తుడైనమన్మథుని బాణముదెబ్బలు తినుటచేతనేమో సిగ్గు విడిచినసూర్యుడు, దెసమొలలు గలకన్య కలను, చెఱుపుచున్నాడు. కామప్రవృత్తి లేనిలేతపిల్లలను గూడుచున్నాడని వ్యంగ్యము. సూర్యుడు కన్యారాశియందు ప్రవేశించుట సూచితము.

"అతిసంచితార్థజీవన
హరణాదివ దుష్టచోరనవశరదా
నిర్ధనదేహాఇవ
వైవర్ణ్యం దధతేంబుభృచ్ఛకలాః"

చంద్రిక :— కష్టపడి మితిమీరి సంపాదించిన తమ జీవనద్రవ్యమును (నీటిని అని భావాంతరము) ఈదుష్టుడగుశర దృతువుగాడు అపహరించుటచేనేమో, మేఘము లన్నియు బీదల శరీరములు పాలిపోయినట్లుగా తెల్లబడి పోయినవి తగిన తిండి లేనివారిదేహములు రక్తపుష్టి తగ్గి పాలిపోవుచుండును.

"వర్షప్రయుక్తబహుకర్దమలిప్తదేహా
జీమూతకంబలపిధాననిరస్తశోభా
పూర్ణావదాతశరదాయతచంద్రికాయాం
స్నాతాఽతినిర్మలతనుం దధతీవ భూమిః"

చంద్రిక .— వర్షములచే లోగడ దేహ మంతయు బురద కలదై, మేఘము లనెడినల్లనికంబళిని కప్పుకొని, కాంతి తరిగినభూదేవి, ఈశారదరాత్రులందలి తెల్లనివెన్నెలలో స్నాన ముచేసి నిర్మలమై ప్రకాశించినది.

"బంధుజీవ కుముదాబ్జ మాలతీ
పుండరీక సుమజన్మకారణా
క్రౌంచసారసమరాల తోరణా
పుష్పగంధ విహారత్సమీరణా"

చంద్రిక :—మంకెనలు, కలువలు, తామరలు, మాలతులు, తెల్లతామరపూలును మిక్కిలిగా కుసుమించును. క్రౌంచపక్షులు, సారసపక్షులును ఆకసముపై సాయంప్రాతః కాలములందు తోరణములు కట్టి రివ్వున నెగిరిపోవుచుండును. పూలవాసనలతో కలిసిన వాయువులు సంచరించుచుండును.

"చంద్రముఖీ తారామణి
గణగళమాలా చకోరచపలాక్షీ
కుందరదనాఽతినిర్మల
చార్వీహాసనా నిశా శరది"

చంద్రిక :— ఈ ఋతువునందు రాత్రి యనురమణి, చంద్రుడను ముఖము కలదై, వెన్నెల యనునవ్వు కలదై, నక్షత్రము లనుమణిమాలను ధరించి, చకోరకము లనుచంచలనేత్రములు కలదై, మల్లిమొగ్గ లనుపలువరుసతో ప్రకాశించుచుండును.

"కరముసలై రుడుయవకం
బ్రహ్మాండోలూఖలే శరద్భుంక్త్వా
విస్తారితచూర్ణకఇవ
విలస త్యచ్ఛాచ్ఛచంద్రికా నితరామ్"

చంద్రిక :— ఈఋతుకాంత, రవికిరణము లనురోకళ్లచే, రిక్కలనెడి నాన్పుడుబియ్యమును, బ్రహ్మాండ మనెడి

ఱోటిలో పోసి దంచి, ఆపిండితడి యారుటకై లోకమున నెఱపి యెండబోసినటులు స్వచ్ఛమైన వెన్నల ప్రకాశించెను.

"గంగాతరంగడోలో
త్సవకుతుకా హంసపంక్తయ శ్శరది
సంచారిహైమశకలా
ఇవ నాకనదీం విశంతి పటుగమనైః"

చంద్రిక :— ఈకాలమున హంసలు వరుసలువరుసలుగా గంగాతరంగము లనెడిఉయ్యాలల నూగుకుతూహలముతో నడచుచున్న మంచుముక్కలవలె దీర్ఘప్రయాణములు చేసి ఆనదిని చేరుచుండును. "తాంహంసమలాశ్శరదీవగంగాం" అని కవివర్ణనము దీనికిప్రమాణము–

"నాగవల్లీక్షుకేదారపాలికా యువకై స్సమం
సల్లాపై స్సరసై రేలాగీతైః క్రీడంతి నిర్భరమ్"

చంద్రిక:— తమలపాకుతోటలయందును, చెఱకుతోటల యందును కాపున్న యువతులు యువకులతో కలిసి సరససల్లాపములు చేయుచు ఏలపాటలు పాడుకొనుచు నిశ్చింతముగా విహరించిరి.

"మదేన చాక్రమ్య తటాకకూలం
పద్మైశ్చ శృంగైశ్చ రజః కిరంతః
సరోష ముఃఖాంతరదత్తనేత్రా
నదంతి ధావంతి తదా మహోక్షాః"

చంద్రిక :— మదించిన ఆబోతులు వేఱొకయాబోతును కోపముతో కాంచుచు, చెఱువుగట్లను కొమ్ములతో-గిట్టలతో దువ్వి దుమ్మెత్తిపోయుచు, అఱచుచు పరుగులెత్తుచు, కయ్యము నకు కాలుద్రవ్వుచుండును.

"ప్రజాః ప్రతోళి ష్వతిశీతలార్తాః
ప్రకల్ప్య శీతజ్వాలనా నుషస్సు
తదా పరీవృత్యచ సేవితోష్ణాః
ప్రకామ మానంద మనుప్రవజంతి"

చంద్రిక :— చలిబాధకు తాళలేక ప్రజలు, నాలుగు వీథులనడుమ తెల్లవారుజామున చలిమంటలు వేసికొని, దాని చుట్టును జేరి చలి కాగుచు ఆనంద మనుభవింతురు. శీతజ్వాలన మనగా చలికొఱకు వేసినమంట.

"రాజన్య జైత్రయాత్రానుప్రేరణార్థ ముపాగతా
అగస్త్యోదయసౌభాగ్యకారణం తారణా శరత్"

చంద్రిక :— ఈశరత్తు రాజులను జైత్రయాత్రలకు వెడలు డని ప్రేరేపించునది. అనగా వర్షములు వెనుకపట్టుటచే రాజుల విజయయాత్రల కనుకూలము. నక్షత్రరూపుడైన అగస్త్యముని యుదయించి వర్షకాలపు మురికినీటిని తేరునట్లు చేయును. అట్టి సౌభాగ్యముతో జనులను తరింపజేయుచు ఈ కాలము వచ్చిన దని భావము. అగస్త్యనక్షత్రోదయము

కాఁగానే భూమిపై పడిన ముఱికిసీ రంతయు ముత్తెమువలె తేలుకొనును.

"విప్రా నుపాసనరతా న్నవరాత్రపూర్ణ
దీక్షాపరాన్ విదధతీ లలితార్చనాద్యైః
మూలే ప్రతిష్ఠితసుపుస్తకరూపవాణీ
దివ్యార్చనాదివరదా శరదాజగామ"

చంద్రిక :— ఈకాలమున ఉపాసనాపరులైన బ్రాహ్మణులు నవరాత్రపూర్ణదీక్షను పూని సహస్రనామములతో లలితామాతను పూజింతురు. కొందఱు మూలానక్షత్రప్రవేశమునుండి మూఁడుదినములు పుస్తకరూప సరస్వతిని కుంకుమపుష్పాదుల నర్చింతురు. "మూలే నావాహయే ద్దేవీం శ్రవణాంతే విసర్జయేత్" అని శాస్త్రము.

"అనంతదామోదరమోదపాత్రం
సకృత్తికాస్నాన మనంతపుణ్యమ్
ఉషోముఖే గోఘృతదీపదానం
చాత్తం శరత్త్వత్కృపయా జనౌఘైః"

చంద్రిక :— ఈకాలమున దామోదరప్రీతి నందుటకై కృత్తికానక్షత్రముండగనే, అనగా నాల్గుగడియల రాత్రి యున్నదనగనే లేచి, నదుల కేగి జనులు కృత్తికాస్నానములు చేయుదురు. అది అనంత పుణ్యము నిచ్చును. సూర్యోదయము

కాకముందే ఆవునేతిదీపములను వెలిగించి. దొన్నెలం దిడి నదులలో విడిచెదరు. ఇట్టి పుణ్యకార్యములను జనులచే చేయించునది శరత్తు.

"దేవాలయమర్త్యాలయ
కుంకుమపూజా విరాజమానపదామ్
సేవే కర్పూరాగురు
నీరాజితధూపితాం జగజ్జననీమ్"

చంద్రిక:— దేవాలయములందును, ప్రతిగృహమందును కుంకుమపూజలచే ప్రకాశించుచు, కర్పూరదీపములతో అగురు ధూపములతో నీరాజింపఁబడిన జగజ్జననిని సౌభాగ్యదేవతను సర్వదా సేవింతురు. కుంకుమపూజలు లలితకు చేయించుకొనుట ఆచారము.

"చంద్రోమాఖ్యే సువ్రతే పుణ్యకాంతా
చంద్రం దృష్ట్వా కుంకుమాద్యైః ప్రపూజ్య
చంద్రాకారం భక్ష్యజాతం నివేద్య
దానం దత్తే భక్తితః పుణ్యనార్యై"

చంద్రిక:— ఈకాలమున పుణ్యస్త్రీలు చంద్రోమావ్రతము చేయుదురు. వారు చంద్రబింబమును చూచువఱ కుపవసించి, కుంకుమాదులచే చంద్రోమాదేవిని (గౌరిని) పూజించి చంద్రాకారమైనభక్ష్యములు (అట్లు) చేసి గుడము ఘృతమును

వాసిపై నుంచి సువాసినికి వాయనము నందింతురు. ఇది స్త్రీల సౌభాగ్యవర్ధన మైనవ్రతము.

"దీపావలి ర్జయతు సర్వగృహాగ్రసౌధ
కుడ్యస్థితా ధలధలాయితకాంతిపుంజా
పాపాపనోదనచణా ఘృతవర్తి యుక్తా
హ్యాచారతత్పరలసద్గృహిణీప్రదత్తా"

చంద్రిక :— దీపావళ్యమావాస్యనాడు పూర్వాచార తత్పర లగుకాంతామతల్లులు తమ మేడల, యిండ్ల గోడలపై వందలకొలది దీపములను ఆవునేతితో వెలిగించి పెట్టుదురు. అవి చిఱుగాలికి కదలుచు మిలమిల మెరసిపోవుచు జనులపాపము లను పోగొట్టునట్లును.

"యుష్మద్వంశీయాని, హ్యేతాని సుతాంకురాణీతి
జ్ఞాపయితుం స్వపితౄణాం బాలా స్సాయం దధత్యుల్కాః"

చంద్రిక :—ఈబిడ్డపాపలందఱును మీామీావంశమందలి పుత్త్రిరూపములైన అంకురములు. మీారు చూచి సంతో షింపుడు. అను నిగూఢభావము సూచించుచు పితృదేవతలకు దివ్విటీలవెలుగులో తమ్ము చూపించుకొనుచు, పిల్లలు దర్శ నాటి సాయంకాలమున గుమ్మములముందు నిలుచుండి దివ్విటీలు కొట్టుదురు. జొన్న, గోగు మొక్కలు తెచ్చి వానికి నూనె గుడ్డలు చుట్టి, వెలిగించి వానిని నేలను కొట్టుచు "దిబ్బూ దిబ్బూ దివ్వెలమాసా-మళ్లీవచ్చే నాగులచవితీ, పుట్టామీాదా

జొన్నాకత్తా, పెట్టవె బెల్లం పిల్లలతల్లీ" అని పాటపాడుదురు. పిదప కాళ్ళు కడిగికొని తల్లి పెట్టిన తీపిపదార్థమును తిందురు.

"వివిధధ్వనిభి ర్దీపై
ర్విచిత్రరూపై రమానిశీథేతు
సోత్కంఠ మలక్ష్మీ
నిస్సరణం స్త్రీణం కరోతి సానందమ్"

చంద్రిక :— పెక్కురకములధ్వనులు చేయు టపాకాయలు కాల్చుచు, చిత్రవిచిత్రము లైనకాంతుల నిచ్చుముత్యముల మతాబులు, కాకరవత్తులు కాల్చుచు, అమావాస్య నాటిరాత్రియందు స్త్రీలు దరిద్రాదేవిని తరిమివేయుదురు. ఈ పనిని స్త్రీలే అమావాస్యనాటి నడురేయి చేయవలె నని శాస్త్రము చెప్పును. జ్యేష్ఠాదేవి ఆరాత్రి నిశ్శబ్దప్రదేశమును చేరుటకై నగరమెల్ల దిరుగుచుండు ననియు, ఈధ్వనులచే నామెను వెడలగొట్టుట జరుగుననియు భావన.

"దగ్ధాంగక వ్రణిత దేహతలా యువానో
బాలా రుదంతి భయదాగ్నిముఖై ర్వినోదైః
వీధీషు పర్ణ గృహదాహ నివారణాయ
రాత్రౌ చరంతి సజనా స్సజలా శ్శకట్యాః"

చంద్రిక :— ఈవిధముగ వినోదమునకై నిప్పు ముట్టించి కాల్చెడి బాణసంచువలన అంగములు కాలి, దెబ్బలు తగిలి బాలురు యువకులు కొందఱు బాధలు పడుదురు. ఈకాల్పుల

వలన ప్రమాదము సంభవించి యెచ్చటేని పూరిండ్లు అంటు
కొనగల వనుభయముచే నీరు నింపిన శకటములు జనులును
నిశీధిని రాత్రియంతయు తిరుగుచుందురు.

"రత్నమయీం స్వర్ణమయీం
రజితమయీం ధనమయీం మహాలక్ష్మీమ్
అర్చం త్యమానిశాయాం
లక్ష్మీపుత్రాస్తు వైదికైర్మంత్రైః"

చంద్రిక:—అమావాస్యనాటిరాత్రి రత్నములు, బంగా
రము, వెండి, రూపములో నున్న సంపదలను ప్రోగులుపోసి
ధనవంతులు వేదమంత్రములతో లక్ష్మీపూజను చేయుదురు.
ఈయాచార మిప్పటికిని 'మార్వాళీలు' అనుజాతివారు వైభవ
ముగ జేయుచుందురు.

"స్నాత్వా పవిత్రవసనం పరిధాయ తన్వీ
గోక్షీరకేణ తిలగోళవిఘృష్టితాభ్యామ్
గత్వాఽహివల్మీక మనన్యధియా సమర్ప్య
నాగేశ్వరం భజతి సర్వభయప్రశాంత్యై"

చంద్రిక :—భారతనారి నాగులచవుతినాడు నదిలో
స్నానముచేసి, మడిబట్ట కట్టుకొని ఆవుపాలు, చలిమిడి,
చిమ్మిలిని పట్టుకొని భక్తిపూర్వకముగ పాముపుట్టకడకు పోయి
నాగరాజును పూజించి పుట్టలో పాలు పోసి నైవేద్య మిడును.

దీనివలన సర్పభయమున్ను ప్రమాదము లుండవని భావన. పాలు పోయునపుడు "ఈపుట్టలో పాలు సీపొట్టలో పొ స్తి-నాజోలికే రాకు నాగేశ్వరా" అనుపాట పాడుచు క్షీర మర్పింతురు.

"మంగళవాద్యై స్సాంబం
శివ ముడుపే సన్నివేశ్య శివభక్తాః
ఘృతవర్తి పత్రపుటికా
దీపా న్నద్యాం క్షిపంతి తీహ".

చంద్రిక :—మంగళకర మైనవాద్యములు మ్రోయగా సాంబసదాశివుని నావపై బెట్టుకొని-అనటాకు దొన్నెలలో ఆవునేతివత్తులను వెలిగించి భక్తు లెల్ల ఆదొప్పలను నదిలో పయనించుచు విడిచెదరు. ఇదే క్షీరాబ్ధిద్వాదశినాడు గ్రామీణులు చేయునుత్సవము. దీనికి వ్యవహారము 'తెప్పతోరణోత్సవము' అని. పిదప జనులు-దేవుడును నదిలో స్నానములు చేసి మరలుదురు.

"క్షీరాబ్ధిద్వాదశ్యా
మాపూర్ణా దీపికాసహస్రైశ్చ
పరిహసతీవ సతారం
విష్ణుపదం సా తరంగిణీ నితరామ్"

చంద్రిక :—పై విధముగా రాత్రిభాగమున ఆనది దీప సహస్రములతో నిండి కలకలలాడుచు కోటినక్షత్రములతో కూడినఆకసమును చూచి నవ్వుచున్న ట్లుండును.

"జాజ్వల్యమానతృణకల్పితతోరణాధః
పల్యంకికాంతరితసాంబసదాశివోఽయం
కుర్వన్ ప్రదక్షిణ మనుప్రవిశన్ త్రివారం
స్నాత్వా ప్రయాతి వరమంగలవాద్యఘోషైః"

చంద్రిక :—వట్టిగడ్డిని లావుపాటివెంటిగా చుట్టి, ఎడ పెడల కంబములకు దానిని బిగగట్టి, కొంతచొప్పను వ్రేలగట్టి దాని నంటింతురు. అది మంటల నెగజిమ్ముచుండగ పల్లకిలో నున్న శివుడు పత్నీసమేతుడై వాద్యములు మ్రోగుచుండ దానిని ముమ్మారులు ప్రదక్షిణించును. జనులు గడ్డివెంటిని బట్టి అటు నిటు లాగికొని గుప్పడేసి గడ్డిపరకలను కొనిపోయి యింటి గోవులకు తినిపింతురు. అది వానికి కడుపుచలువ నిచ్చునట. దీనినే "జ్వాలాతోరణోత్సవము" అని చెప్పుదురు. ఇది కార్తికపూర్ణిమనాడు జరుపుకొందురు.

"శత్రుఘ్నీం పాపఘ్నీం
పుణ్యాం నరచాపధారిణీంచ శమీమ్
పశుపతిసహితా స్సర్వే
గత్వా తా మర్చయంతి సద్భక్తాః"

చంద్రిక :—శత్రువులను హరించెడి, పాపముల త్రుంచెడి-అర్జునుని ధనుర్బాణములను ధరించిన జమ్మిచెట్టుకడకు ఉత్సవశివునితో గూడి భక్తులందఱును వెళ్లి దానిని షోడశోప

చారములచే పూజింతురు. దీనినే శమీపూజ అందురు. పూజానంతరము "శమీ శమయ మే పాపం, శమీ శత్రువినాశినీ,
అర్జునస్య ధనుర్ధారీ, రామస్య ప్రియదర్శినీ"
అని ప్రదక్షిణనమస్కారములు సమర్పింతురు.

"మహారుద్రన్యాసప్రవచన పరై ర్వైదికవరై
ర్మహాబిల్వార్చాభి ర్విధివ దభిషేకప్రియజనైః
మహాదీపై ర్ధూపై ర్హరహరశివే త్యుచ్చలపితైః
మహాదేవ స్స్వాత్మా జయతి పర మూర్జేందుదివసే"

చంద్రిక:— కార్తికమాసమున సోమవాసరములందు వైదికవరు లుపవసించి - మహాన్యాసపూర్వకముగ ఏకాదశ రుద్రాభిషేకములు చేయుచు, లక్షబిల్వదలార్చనము లొనర్చుచు, అభిషేకములు కావించుచు, హరహరమహాదేవశంభో అని కేకలుపెట్టుచు, జేగంటలు పలికించుచు దీపధూపనైవేద్యములచే పరమశివుని పంచామృతస్నానము చేయింతురు.

"క్రీడాసరోవర మభూత్తలు యస్య రేవా
యద్బాహుపంజరశుకోఽజని తత్ప్రవాహః
పౌలస్త్యతీవ్రభుజగర్వవిచర్వణో యః
సోఽయం విభు ర్విజయతే భువి కార్తవీర్యః"

చంద్రిక :— ఏమహాత్మునికి రేవానది క్రీడాసరోవరమైనదో, దానిప్రవాహము ఎవనిబాహుపంజరమున చిలుకవలె

చిక్కినదో-దశకంధరుని భుజగర్వము నెవడు పూర్తిగ నణం చెనో, అట్టికార్తవీర్యార్జునుని జయంతి ఈకాలముననే జరుపుకొనుచుందురు. పై విషయములు పురాణప్రసిద్ధములు.

"గురుశాసనతో గురూక్తవిద్యాం
గురవే యోగబలాత్సమర్పయన్
పరికల్పితశుక్లవేదశాఖః
సజయ త్వగ్నిసమోఽద్య యాజ్ఞవల్క్యః"

చంద్రిక :—గురువులు శాసించుటచే వారియొద్ద చదివిన వేదవిద్యను, తనయోగబలముచే అతనిముందర క్రక్కివేసి, శుక్ల యజుశ్శాఖను సొంతముగ నిర్మించిన అగ్నివంటి యాజ్ఞవల్క్య మునియొక్క జయంతి ఈకాలమున వచ్చును.

"గదాగ్రహస్తోఽపి గదాపహర్తా
సుధాదిదివ్యౌషధిదానశౌండః
చతుర్భుజః క్షీరసముద్రజాతః
జీయా త్స ధన్వంతరి రాదిదేవః"

చంద్రిక :—తాను గదాధారియై సమస్తరోగములను హరించుచు (గద = రోగము, గుదియ) అమృతముతోపాటు వివిధౌషధముల నొసంగి, పాలసంద్రమున చతుర్భుజుడై ధన్వంతరినామమున ఆమహావిష్ణువే జన్మించెను. ధన్వంతరిజయంతియు ప్రజలు ఈకాలముననే జరిపికొందురు.

ఋతుచర్యాయాం శరత్సమాప్తా.

# ఋ తు చ ర్యా

## హేమంతఋతువు—మార్గశిర-పుష్యములు

"రజనీ ద్విగుణీభూతా శీతబాధా చతుర్గుణా
ప్రాతరుత్థానబాధాచ కామబాధాఽయుతాయితా"

చంద్రిక ;—ఇందు రాత్రులు హెచ్చుగ నుండి పగళ్లు తగ్గును. నాలుగురెట్లు చలిబాధ. ఉషఃకాలమందు లేచుట యెట్టివారికిని బాధ కలిగించును. కామాతిరేక మీకాలమున మిక్కుటము.

"దక్షిణాయనగతి ర్హరిదశ్వ
శ్చోత్తరాయణగతిం కురుతేఽద్య
తత్ప్రయుక్తసుకృతోదయకాలే
పుణ్యమాచరతి నైష్ఠికలోకః"

చంద్రిక :—ఈకాలమున సూర్యుడు దక్షిణదిక్ప్రచారమును విడిచి ఉత్తరదిక్సంచారమును చేయుటకు రథమును త్రిప్పును. అట్టియుత్తరాయణపుణ్యకాలమందు నైష్ఠికులు కొన్ని పుణ్యకర్మముల నాచరింతురు. సూర్యునిరథాలు తిరిగినవని నానుడి.

"ప్రబుధ్యోషసి కర్మిష్ఠ శ్శైత్యవేపథుబాధితః
వాంఛత్యుష్ణోదకస్నానం దంశతీతి నదీజలమ్"

చంద్రిక ;—నిత్యకర్మపరుడు తెల్లవారువేళ లేచినను చలికి వడవడలాడుచు నదీజలములు కలచు ననుభీతితో వేన్నీళ్ల స్నానమునే అపేక్షించును. కర్మపరుల కట్టిస్నానము నిషిద్ధము.

"వహ్నార్ద్రాహంకశక్తి
శ్శమితా, శీతానిలాహతే ర్దంతాః
రణితా, స్సర్వాంగేషుచ
పులకోద్భేదః ప్రజాయతే హైమే"

చంద్రిక :—అగ్నికి కాల్చెడిశక్తి తగ్గును. చలిగాలికి కణతలు తటతట కొట్టుకొనుటచే లోనిదంతములును పలు వరుసయు ఒకటినొకటి తాకి కిటకిట చప్పు డగుచుండును. అవయవము లన్నిట చలికి గగుర్పాటు గలుగును.

"ధనురాకారో భూత్వా
సర్వా ణ్యంగాని కూర్మవత్కృత్వా
నిద్రాతి నర శ్శైత్యా
త్సార్థకఇవ భాసతే ధనుర్మాసః"

చంద్రిక :—ఎక్కు పెట్టిన విలుబద్దవలె వంగి, తాబేలు లోనికిముడిచిన ట్లవయవములను ముడుచుకొని చలికి తాళలేక నరుడు నిద్రపోవుట ఈకాలమున సహజము. ధనుర్మాస మని దీని కిందులకే పేరు గలిగియుండునేమో ?

"శ్వానోపి ధనురాకారం కృత్వా దేహం హిమాగమే
చుల్యంత రేషు కోష్ణేషు నిద్రాముద్రాం వితన్వతే"

చంద్రిక :—కుక్కలు కూడ తమ దేహములను ధనురాకారముగ జేసి గోరువెచ్చని ప్రొయిలందు హాయిగ నిద్రించును.

"అపర్ణవృత్త్యా గిరిశాయ పార్వతీ
జలాధివాసా వరమానిదుశ్చరం
హిమాలయాగ్రే నియమాతినిశ్చలా
తపో మహాత్మా చరితుం ప్రచక్రమే"

చంద్రిక :—హిమగిరియందు పరమేశ్వరునుద్దేశించి పార్వతి ఆకులనుగూడ తినుటమాని గాలినే భుక్తిగ గొని, మెడబంటి నీటిలో దిగి, అతినియమనిష్ఠలు గలదై మహామునులుగూడ చేయజాలని దుష్కరతపస్సీకాలముననే చేసినది కనుకనే ఆమెకు 'అపర్ణ' అనుపేరు గలిగినది. "స్వయం విశీర్ణ ద్రుమపర్ణ వృత్తితా పరాహి కాష్ఠా తపసః" అనున్యాయముచే తమంత రాలినఆకులనేని తినకుండ తపించుట అతి కఠినతపము.

"నిష్పేషయంతః పశుబృందకేన
జ్యోత్స్నానిశాసు ప్రవికృత్తసస్యమ్
గీతైః ప్రరావై రవకర్షయంతి
క్షేత్రేషు ధాన్యాని కృషీవలాస్తే"

చంద్రిక :— కోసినవరిపైరును వెన్నెలరాత్రులందు కళ్లములలో పరిచి పశుసంఘములచే త్రొక్కించుచు పాటలు పాడుచు బొబ్బరించుచు పొలములందు రైతులు వరికుప్పలను

నూర్చుచుందురు. వేకువలందు వారి కేకలు దిక్కుల ప్రతి ధ్వనించుచుండును. వారిపలపాటలు వినసొంపుగ నుండును.

"సువర్ణ బిందూపమసవ్యధాన్యా
న్యాపూర్య గోణీషు కృషీవలా స్తే
భూస్వామినాం సాదర మర్పయంతి
గృహేగృహే నృత్యతి ధాన్యలక్ష్మీః"

చంద్రిక :— ద్రవీభూత మైనబంగరుచుక్కలవంటి క్రొత్త ధాన్యమును సంచులలో నిండించి రైతులు భూస్వాముల కాదరాభిమానములతో నిచ్చుచున్నారు. ప్రతిగృహమందును ధాన్యలక్ష్మి తాండవ మాడుచున్నది.

"కుందసహకారలవలీ
సేమంతీ కందుకాశ్చ మందారాః
లోధ్రాశ్చ సిందువారాః
పుష్పసమృద్ధ్యా విరాజంతే"

చంద్రిక :— బొండుమల్లెలు, తీయమామిళ్లు, చేమంతులు, బంతిచెట్లు, మందారములు, లొద్దుగులు, నిర్గుండీవృక్షములు తప్పక ఈఋతువునందు పూచును.

"దుర్బలం పతి మవాప్య కామినీ
బోధితుంచ యదివాఽప్రబోధితుమ్
సాధ్వసేనహి గతాగతం చరం
త్యత్యవాహయ దహో వృథా నిశామ్"

చంద్రిక :— దుర్బలుడైన తనపతిని రాత్రివేళ సమీపించి నిద్రించుట గాంచి, తాను కామిని యగుటచే ఆతని లేపుటా మానుటా ? అని తలంచుచు పోవుచు చేరుచు చివరకు రాత్రియంతయు గతాగతములతో నాసతి వ్యర్థముగ గడపెను. "ఒక్కమగని లేపినను కోపమే లేపకున్నను కోపమే" అను నానుడి.

> "నిద్రాముద్రితనయనాం
> సంకుచితాంగీం స్వకామినీం గత్వా
> కరసంస్పర్శం కామీ
> మంచా దుత్థాపయతి మందమ్"

చంద్రిక :—కాలుసేతులు ముడిచికొని కనులు మూతవెట్టి నిద్రించుప్రేమికురాలిని గాంచి సమీపించి కాముకుడు చేతితో నెమ్మదిగ తట్టి లేపుచున్నాడు.

> "స్తన్యాసక్తం శిశుకం
> విహాయ శయనే పటేన చాచ్ఛాద్య
> ఇతరశిశుబోధభీత్యా
> మందం గత్వోపగూహతే స్వపతిమ్"

చంద్రిక :—తనప్రక్కలో పాలు త్రావుచున్నశిశువును నెమ్మదిగ విడిపించికొని ఒకచిన్నబట్ట నాతనిపై కప్పి, మిగిలిన పిల్లలు లేచెదరేమో అనుభయముతో నెమ్మదిగ పిల్లి నడకలు నడచుచు కాముకి తనపతిని జేరి కౌగిలించెను.

"మాషముద్గనవచూతసుమాని
ధ్వంసయన్; మృదుతరోష్ఠపుటాంశ్చ
నిర్దయం విదలయన్; జనదృష్టిం
బంధయన్; తుహినరాశి రుదేతి"

చంద్రిక :—మినుపచేల పెసరచేల పూతలను పూర్తిగ మాడ్చివేయుచు, మెత్తని పెదవులను పగిలించుచు, జనుల దృష్టిని అరికట్టుచు మంచు చిక్కగ కురియును.

"హిమకిరణముచ్యమానతు
షారప్రలయే జగంతి మజ్జంతి
లోకోద్ధరణపరోఽయం
సహస్రకిరణః ఛినత్తి తద్విలయమ్"

చంద్రిక :— రాత్రులందు చంద్రచంద్రికలచే విడువ బడినమంచు, ప్రలయమువలె జగములను ముంచుచుండగా పవళ్ళు జగదుద్ధారకు డగుసహస్రకిరణు డాప్రలయమునుండి లోకములను లోకులను ఉద్ధరించుచున్నాడు. మహోపకారి యొకడున్నను దేశక్షేమమునకై పాటుపడును.

"శాంకవపిహితశరీరః
తూలాస్తరణే నిశి శయానబుధః
భీతోఽప్యపస్పర్శనతో
లఘుశంకాం కర్తుమపిచ నోత్సహతే"

చంద్రిక :— ఘనమైనకంబలముచే సర్వదేహమును కప్పుకొని, మెత్తనిపరుపుపై రాత్రిలోపల పరుండినపండితుడు, ఉపస్పర్శనము చేయవలెనను భయముచే లఘుశంకను చేయుటకు కూడ ఇష్టపడకుండెను. పురుషుడు పగలు మూత్రవిసర్జనము చేసినపుడెల్ల పాదక్షాలనమొనర్చి ఆచమించవలెననిశాస్త్రము. అర్ధరాత్రి దాటినచో ఉపస్పర్శనముమాత్రమే విహితము. రాత్రిచలికి ఆ పండితుడు తట్టుకొనలేక లఘుశంక కేగుటయే మానుకొనెనట. (ఉపస్పర్శనము=జలమును గండూషించుట.)

"నిమ్నోన్నతాని గిరికందర కాననాని
కుల్యాతటాకగృహజంతుజనాంశ్చ సర్వాన్
ఏకీచకార హిమరాశి రహో ఖలానాం
తుచ్ఛప్రభుత్వసరణిః క్షణికాహి లోకే"

చంద్రిక :— పల్లములు మెరకలు, కొండగుహలు, అడవులు, గోతులు నూతులు చెఱువులు ఇండ్లు, నులు జంతువులు మున్నగు చరాచరప్రకృతిని సర్వమును తనలోనుంచి ఏకముచేయుచు మంచు ఆక్రమించెను. ఆహా! దానిపొగరంతటిది. అదెంతకాలము? తెల్లవారగనే అది నాశనమగును. పేదను బెల్లమును ఏక మొనర్చెడి మంచుయొక్క అధికారము క్షణికమేగదా!

"స్నాత్వాऽతిశీతలపవిత్రనదీజలేషు
సర్వాంగకంపనయుతా శ్శిశుబాలవృద్ధాః
పుష్పం ఫలం రజతరుక్మఫణాన్ ప్రదాతుం
వల్లీసనాథభవనం ప్రవిశంతి భక్త్యా"

చంద్రిక :— చల్లనినదీజలములందు మునిగి అవయవములు వణకిపోవుచుండ, చంటిపిల్లలు బాలకులు వృద్ధులును సుబ్రహ్మణ్యస్వామికి పూలు పడగలు, సమర్పించుటకై గుడికి వెళ్ళుదురు. సుబ్రహ్మణ్యషష్ఠి, ఈకాలమున వచ్చును.

"నిత్యం ధనుర్మాసి గృహాంగణేషు
విచిత్రరూపా బహురంగవల్లీః
చూర్ణేన కుర్వంతిహి నేత్రపర్వ
పరస్పరస్పర్థితయా గృహిణ్యాః"

చంద్రిక :— ఈధనుర్మాసమున నిత్యమును ఇంటి ముంగిళ్ళయందు చిత్రచిత్రములైనరంగవల్లులు ముగ్గుతో వనితలు పెట్టుచుందురు. ఒకరినిమించి మరియొక రీకళను ప్రదర్శింతురు. అవి చూచుటకు కనులపండువుగ నుండును. దశావతారనాగబంధాదు లిందు స్త్రీలు ప్రదర్శింతురు.

"సంక్రాంతిరంగవల్ల్యాం
గోమయపిండాని సకుసుమా న్యుప్త్వా
అభ్యర్చ్య కుంకుమాద్యై
స్సాయం నృత్యంతి కన్యకా గీతైః"

చంద్రిక :—ఆరీతి పెట్టిన సంక్రాంతిముగ్గులో గోమయపు టుండలు పెట్టి, వాని తలలపై ముద్దబంతిపూలను గ్రుచ్చి మంగళదేవతలనుగా భావించి పసుపుకుంకుమలచే నలంకరించి పూజించి అక్షతలు చల్లి సాయంసమయములందు ఆడుపిల్లలు వానిచుట్టు తిరుగుచు పాటలు పాడుచు చప్పట్లు గొట్టుచుందురు. దీనినే గొబ్బెమ్మపూజ, గొబ్బెళ్ళు అందురు. నివేదించిన పదార్థము నందఱును తిందురు.

"ధృతరక్తాంబరో మూర్ధ్నా తామ్రపాత్రం వహన్, హరిం
కీర్తయన్ ధానుషే మాసి భిక్షా మటతి దాసరీ"

చంద్రిక :—ఎఱ్ఱని పట్టుపంచెను ధరించి అలంకరించుకొని తలపై రాగిపాత్రను ధరించి హరికీర్తనము చేయుచు చిఱుతలు వాయించుచు ఈ ధనుర్మాసమంతయు దాసరి, అను భక్తుడు ఇంటింటికిని భిక్షకు వచ్చును.

"పర్యటంతః ప్రతిదినం సాయంసాయంచ బాలకాః
గాయన్తః ప్రార్థయంతిస్మ పిష్టకా నీంధనానిచ"

చంద్రిక :—సాయంసమయములందు బాలకులు గుములుగూడి తట్టపట్టుకొని యింటింటికి తిరుగుచు "ఇచ్చినమ్మకి పుణ్యాం - ఇవ్వనమ్మకి పాపం" అనుపాటను పాడుచు పిడకలను పుల్లలను భోగిమంటకొఱకై అడుగుచుందురు.

[9]

"భోగిజ్వాలనం కృత్వా
తస్మిన్నిక్షిప్య యాచితేంధనకమ్
చౌర్యాహృతకాష్ఠాన్యపి
క్షిపంతి పరివేష్ట్య సేవితోష్ణాస్తే"

చంద్రిక :— పిల్లలందఱును భోగినాడు పెద్దమంటను కల్పించి, అడిగి తెచ్చినపుల్లలు - పిడుకలును అందు వేసి - ఆరాత్రి మఱికొన్ని అపహరించి తెచ్చియు ఆ మంటలు వేయుదురు. పిల్ల లానాటిరాత్రి చేసిన అపహరణమునకు ఎవరును నిందింపరు. దీనినే భోగిమంట అందురు. పిల్లలు తలంటుకొని క్రొత్తబట్టలు కట్టుకొని వచ్చి భోగిపిడకలదండలను ఈమంటలో వేయుదురు. దానిచుట్టును మూగి పెద్దలు పిల్లలు చలికాచుకొందురు.

"నిశితచ్ఛురికాభీషణ
చరణాయుధ వల్గితోగ్రసంగ్రామాన్
పరికల్ప్యముదితమనసః
కతిచి త్ప్రథయంతి పౌరుషాని జనాః"

చంద్రిక :— పత్తనములలోను పల్లెలలోను కాళ్ళకు పదనైన చిన్నికత్తులు కట్టి కోడిపుంజులచే దెబ్బలాడింతురు. అవి కత్తికాళ్ళతో పొడుచుకొని రక్తములు కార కలహించుచుండగా దానిని చూచి ఆనందించుచు గెలిచినవారు మీస

ములు దువ్వుచుందురు. వీనినే కోడిపందెము లందురు. పల నాటి మహాయుద్ధ మీకోడిపందెములవలననే సంభవించిన దందురు.

"సుధాధాతుద్రవై ర్గేహాన్ నూత్నవస్త్రై స్తనూలతాః
అలంకుర్వంతి సంక్రాంతౌ నవ్యం చాహ్లాదకం జగత్"

చంద్రిక :— ఈకాలమున సున్నముచే-రంగులచే గృహ ముల నలంకరింతురు. నూతనములైన చిత్రచిత్రవస్త్రములను ధరించి దేహముల నలంకరింతురు. కాన దేశ మంతయు క్రొత్తరూపము దాల్చి ఆనందమున మునుంగును.

"సువాసినీసమ్మిలితా నవోఢా
అలంకృతా స్సాక్షతపుష్పపాత్రాః
తూర్యస్వనైః పుత్తలికా గ్రహీతుం
కులాలగేహాభిముఖం చలంతి"

చంద్రిక :— క్రొత్తగ పెండ్లియైన బాలికలు, యువతు లును అలంకరించికొని, అక్షతలు, పూలు-తవ్వొడేసి కొత్త ధాన్యమును పళ్ళెరములందు పోసికొని వాద్యములతో మట్టి బొమ్మలను దెచ్చుకొనుటకై కుమ్మరివానియింటికి వెళ్ళు చున్నారు. ఆధాన్య మాతని కిచ్చి బొమ్మలను తీసికొను టాచారము.

"గౌరీం మృత్పుత్తలికా
స్వావాహ్య సముత్సుకా దినాని నవ
నిత్యం చందనకుంకుమ
సుమపూజాం సైరిణా మాచరతి"

చంద్రిక :— ఆమట్టిబొమ్మలయందు గౌరీదేవి నావా హించి తొమ్మిదిదినములు చందనహరిద్రాకుంకుమలచే సువాసి నులు పూజించుచు దినమునకొకపిండివంట నైవేద్య మొనర్చు చుందురు. సావిత్రిగౌరీవ్రత మని దీనిపేరు.

"ఉద్వాస్య గౌరీం దశమేతు నార్యః
పల్యంక మారోప్య సమర్చయంత్యః
వాద్యై ర్నదీం ప్రాప్య దధిప్రయుక్తా
ధానా నివేద్యాఽశు జలే క్షిపంతి"

చంద్రిక :— పదవదివసమున యథావిధి పూజలుచేసి ఆబొమ్మల నన్నిటిని పల్లకిలోనుంచి బహువిధవాద్యములతో స్త్రీలందఱును బయలుదేరి దారిపొడవున పసుపు కుంకుమ ములు పువ్వులతో గౌరిని పూజించుచు ఒకనదిని చేరి పెరుగులో నానవేసిన అటుకులను నివేదించి-అనటికంబములతో ఒక తెప్పను గట్టి అందుబొమ్మల నుంచి నదిలో విడిచెదరు. పిదప నివేద్యపదార్థము నచటివారికి పంచిపెట్టుదురు. ఇదే బొమ్మల నోము అని యందురు.

"పుష్యే సంక్రాంతౌ త
న్నూతనజామాతు రాగతిం జ్ఞాత్వా
శ్వశురః క్షుభ్యతి కృపణో
ధనవ్యయం విగణయన్ హృదయే"

చంద్రిక :— ఈసంక్రాంతిపండుగలకు క్రొత్త అల్లుడత్త వారింటికి వచ్చును. ఆవిషయము గ్రహించి పిసినిగొట్టగు మామ ధనము వ్యయమగు ననుబెంగచే లోలోన బాధపడు చుండును. అత్తవారు క్రొత్తఅల్లుళ్ళను రావించి నూతన వస్త్రాదులచే గౌరవించుట ఆచారము.

"మంచస్థోమాధవం దృష్ట్వా నహి జన్మేతి ధర్మతః
ప్రభోత్సవాన్ ప్రకుర్వంతి పూర్వాచారపరాయణాః"

చంద్రిక :— మంచెపై నిలిపిన పరమశివుని దర్శనము జన్మరాహిత్యకారణ మని పక్కనగరగ్రామములందు ప్రభోత్సవములు చేయుదురు. ప్రభ అనగా వెదుళ్ళతో గుమ్మడిగింజ ఆకారముగా కట్టి అలంకరించినమంచె.

"అధ్యాసితశరభేశ్వర
విగ్రహాయుక్తాః ప్రభాః ప్రభాపూర్ణాః
వివిధగ్రామాయాతా
మిలంతి చాసాయ [illegible]రామే"

చంద్రిక :—ఇట్లు ప్రభలను నిర్మించి శరభేశ్వరస్వామి సందు నిలిపి, చుట్టుపట్టులనుండి వచ్చిన ప్రభలన్నియు ఒకపెద్ద తోటలో విడియును. సాయంకాలమువఱకు అట తీర్థము జరుగును. ప్రజలు తండోపతండములుగ చేరుదురు.

"ఏకస్థం కృత్స్న మాలోక్య తత్ర తం శరభేశ్వరమ్
నమంతి మానవా స్సర్వే ఫలపుష్పసమర్పణైః"

చంద్రిక :— సర్వవ్యాపి యగుశరభేశ్వరుని ఒకచోట నిలుపుకొని మానవు లందఱును ఫలపుష్పసమర్పణములుచేసి పూజించుచున్నారు.

"గాయంతి గాయకా దేవవేశ్యో నృత్యంతి సన్నిధౌ
భక్తాః ప్రభా మావహంతో గ్రామాచారం చరంతిచ"

చంద్రిక :—తత్సన్నిధిని గాయకులు గానము చేయుదురు. వేశ్యలు నాట్య మాడుదురు. సాయంకాల మగుట తోడనే భక్తులాప్రభను మోయుచు గ్రామసంచారమును చేయించి దైవదర్శన మందఱికిని కలిగింతురు.

"ఆకాశచుంబిశిఖరై స్సమలంకృతేన
శ్రీరంగభక్తజనకోటివిచాలితేన
లక్ష్మీసనాథ ఇహ రంగపతీ రథేన
వీథీషు సంచరతి దీనజనావనేచ్ఛుః"

చంద్రిక — శ్రీరంగపట్టణమందు లక్ష్మీసనాథుడైన రంగపతి ఆకసమును తాకుచున్న శిఖరము గలమహారథము, నెక్కి, వేలకొలది రంగభక్తులు తనరథమును లాగుచుండగా, దీనజనులను గాపాడుకోరికతో పట్టణవీధు లన్నియు తిరుగుచు భక్తులకానుకలను హారతులను పూలమాలలను గ్రహించును.

"వివృతస్వర్గద్వారా
వైకుంఠైకాదశీ మహాఫలదా
అద్యోపవాసజాగర
భజనపరో నరో హరిం భజతి"

చంద్రిక : — తెరువబడిన స్వర్గద్వారముగ వైకుంఠైకాదశినాడు ఉపవాసము లుండి హరిభజనలు చేయుచు రాత్రియంతయు జాగరముచేసి మానవులు ముక్తిని సంపాదింతురు. దశమినాడేకభుక్తముచేసి ఏకాదశిని నిరుపవాసము చేసి ద్వాదశినాడు పారణసేయుట ఏకాదశీవ్రతపద్ధతి.

ఋతుచర్యాయాం హేమంతస్సమాప్తః.



# ఋతుచర్యా

శిశిర ఋతువు—మాఘఫాల్గుణమాసములు.

"పవన స్సోర్యష్ణరశ్మిశ్చ మందీభవతి తీవ్రతా
దివసస్య తుషారస్య సంకోచ శ్శిశిరేఽభవత్"

చంద్రిక :— గాలియొక్కయు సూర్యునియొక్కయు తీవ్రత ఈ కాలమున తగ్గును. పగటిభాగముయొక్కయు మంచుయొక్కయు తగ్గుదల కానవగును. అనగా అహః పరిమాణము తగ్గును.

"సమోష్ణశీతలః కాలః లతావృక్షాశ్చ నిత్యశః
స్వరూపశేషాః పత్రాణాం త్యాగా స్నిర్ధనికాఇవ"

చంద్రిక :— ఈకాలము శీతలోష్ణములు సమముగ నుండునది. తీగలు వృక్షములును ఆకులను రాల్చివేయుటచే మోడులుగా కనిపించుచు తిండితిప్పలు లేనిబీదవారివలె యెండిన ట్లుండును.

"శిశిరే కుందమందారసహకారా స్సుమవ్రజమ్
వహంతి జగదానందసుగంధాత్యంతబంధురమ్"

చంద్రిక :—ఆకులు రాల్చి చిగిర్చి మల్లెలు మందారములు తీయమామిళ్ళను పరిమళముల జిమ్ము పూవులను పూచుచుండును.

"గ్రీష్మాతపసంతాపం
వర్షానిలశైత్యకష్టనం హైమే
హిమసంతతిదుష్ప్రిడాం
తీర్త్వా శిశిరే నరో ముదం ప్రయాతి"

చంద్రిక :—మానవులు వేసవిగాడ్పులను, వర్షబాధలను, చలియొక్క కఱపులను దాటి ఈకాలమున సమశీతోష్ణత వలన ఆనందము నందుదురు.

"స్తనఘనజఘనేషు కామినీనాం
మృదువసనాని ముదా విచాలయంతః
సుమపరిమలభార ముద్వహన్త
శ్శిశిరసమీరవిటా శ్చరంతి మందమ్"

చంద్రిక :—కామినుల స్తనజఘనములందలి మృదువైన చీరలను నెమ్మదిగ తొలగించుచు, అనగా ఆపాటిగనే వీచుచు, పుష్పపరిమలమును వహించుచు-అత్తరు మొదలగు సువాసన ద్రవ్యములను పూసికొని ఆనందముగ నెమ్మదిగ శిశిరపుగాలు లనెడివిటులు సంచరింతురు.

"కుసుమాధరమకరందం
పాతుం మల్లీం సమనునయన్ భృంగః
గానక్రీడాశ్లేషణ
నటనై రాకృష్య తత్క్రియాం చక్రే"

చంద్రిక :—లతాకాంతయొక్క పువ్వను పెదవిని గ్రోలుటకై భృంగవిటుడు సమీపించి, దాని ననునయించుచు, పాటలుపాడి కౌగిలించి, క్రీడనము నెఱపి నటించి, ఆమె నాకర్షించి అనుకొన్నపనిని పూర్తి చేసెను. పూచినమల్లి పొదపై తుమ్మెదలు వాలుట భావింపబడెను.

"ఉత్ఫుల్లసుమోల్లాసాం
కోరకరదనాం విసారివిటపకరామ్
మల్లీ వల్లీం గత్వా
హల్లీసక మాతనోతి మధుపకులమ్"

చంద్రిక :—వికసించిన పూలనవ్వులుగల, మొగ్గలనెడి పలువరుసగల, సాగిన తీగలనెడి బాహువులుగల మల్లిపొదలను సమీపించి తుమ్మెదలగుంపు హల్లీసక మనునాట్యవిశేషమును ప్రదర్శించుచున్నది. మల్లిపొదలకడ భృంగములు మిక్కిలి సంచరించుచుండు ననుట.

"స్తన్యాసక్తశిశుప్రసారితతనూన్ ప్రేమ్ణా లిహంతీ ముహుః
దంష్ట్రాభిశ్చ నఖాంకురైః స్వశిశుకాన్ సంతర్జయంతీ సకృత్
అక్ష్ణో రర్ధనిమీలనేన సుభగం పుత్రప్రియం తన్వతీ
వ్యాఘ్రీ సాంధ్యసుఖాతపేహి శిశిరే శేతే వనే నిర్భరమ్"

చంద్రిక:— అంగకములతో సాగిసాగి చనుగుడుచు తనపిల్లలను ప్రేమచే నాకుచు, వానివలన తనకేపాటినొవ్వ

గలిగినను కోరలు చూపి గోళ్ళు చూపి కొంచెముగ భయము కలిగించుచు, తన కన్నులు సగము మూసికొని చూచుచుం డుటచే సంతతియందలి ప్రేమాతిరేకమును ప్రకటించుచు, వన ములో సాయంకాలపు ఎండలో సుఖముగా ఆడుపులి పరుండెను.

"వృక్షలతాపత్రోపరి
వర్షిత్వా తుహిన మతితరాం రాత్రిః
ఉపసితు భానుభయాదివ
విముంచతి శీర్ణ జలకణమిషా దశ్రు"

చంద్రిక :—రాత్రి, చెట్లయొక్క తీవలయొక్క ఆకు లపై చిక్కనిమంచును మిక్కిలిగా వర్షించి వానికి శీతలబాధ కలిగించి, ప్రాతఃకాల మగుతోడనే ఈతప్పుపని చేసినతన్ను తపనుడు శిక్షించితీఱును అనుభయముచేతనేమో తెల్లవారగట్ల నుండియు మంచుబిందువు లనెడి కన్నీళ్ళను జార్చుచున్నది.

"ప్రఫుల్ల కాశాఇవ పుష్పితాగ్రా
స్సువేణుదండాఇవ దీర్ఘదేహాః
సుకావ్యభాగాఇవ పర్వయుక్తాః
పుండ్రేక్షవో భాంతి రసప్రపూర్ణాః"

చంద్రిక :—వికసించినరెల్లువలె పుష్పించిన కొనలుగల-వెదురుగడలవలెపొడవైనగడలుగల - ఉత్తమకావ్యభాగ

ములవలె పర్వములతో (గనుపులతో) కూడినవై, రసప్ర పూర్ణములై చెఱకుతోట లుండెను. ఇందు కావ్యభాగములు వీరశృంగారాదిరసపూర్ణ ము లగుట వ్యంగ్యము.

"నిష్పిష్టశేషం తుష ముద్వమంతో
దుర్గంధధూమం పరితః కిరంతః
అయోమయా శ్చాగ్నిముఖేక్షుయంత్రా
విందంతి రాత్రించరభావ ముగ్రమ్"

చంద్రిక :—రసము పిండి వేయబడిన పిప్పిని విడుచుచు-జంతువులను నమలి విడిచినపిప్పిని ఉమియుచు, దుర్వాసన గొట్టుపొగను జిమ్ముచు - దుర్గంధపూరిత మగునోళ్లనుండి ధూమము వంటివాసనగాలులను విడుచుచు, అయోమయము లైన - (ఇనుముచే చేయబడిన) తెఱచినముఖములవంటి పొయిలందు భగభగమండు మంటలు గలవై రాత్రింబవళ్ళు చెఱకు నాడెడిమిల్లులు భీతి గలిగించురక్కసులవలె ఒప్పెను. రాక్షసధర్మములుగూడ ఇందు సూచితములు.

"చూతశాఖాసు గుచ్ఛస్థశలాటూన్ లోష్ఠతాడనైః
శ్లథయంతోఽర్భకా స్స్వైరం లేహ్యాఖండా న్ప్రచక్రిరే"

చంద్రిక ;—మామిళ్ళు గుత్తులుగా కాయలు కాయగా వానిని పిల్లలు చూచి బెడ్డలతో కొట్టి ఆపిందెలను రాల్చి వానిని ముక్కలుచేసి పచ్చడిబ్రద్దలుగా చేయించి నంజుకొను చున్నారు. వీనినే శ్రీనాథుడు 'వడపిందె' లనినాడు.

"భృంగికులసంగీతక
మంగీకుర్వంతి చూతసుమగుచ్ఛాః
నిర్గుణపుండ్రేక్షుధనుషి
శరతావ్యర్థత్వ మాకలయ్యేవ"

చంద్రిక :—మామిడిపూలగుత్తులు భ్రమరములగీతము లను వినువుగొనక సర్వదా వినుచున్నవి. అట్లు చేయనిచో భృంగములకు కోపము రావచ్చును. వచ్చినచో కాముని చెఱకువింటి కవి నారిగ (త్రాడుగ) ఏర్పడవలెనుగదా. అట్లవి కానొల్లనిచో పంచశరుని బాణ మైనచూతమునకు వ్యర్థత గలుగును. తమపుట్టువు వ్యర్థ మగునను భీతిచేనేమో విను చున్న వని భావన.మదనుని చెఱకువింటికి తుమ్మెదలబారే త్రాడు. అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము లతని పంచబాణము లనిప్రసిద్ధి.

"కాలకూటగిలనాత్తవిమోహాత్
శంకరః పున రవాప సుసంజ్ఞామ్
తద్విపత్తరణకాలయుతైషా
రాత్రి రేవహి మహాశివరాత్రిః"

చంద్రిక:—క్షీరసాగరమథనసమయమున పుట్టి లోకము లను దహించుకాలకూటమహావిషమును లోకరక్షణార్థము త్రాగి, దాని తాకిడికి మూర్ఛపోయి పరమశివుడు ఏరాత్రి మరల తెలివిని గాంచెనో ఆరాత్రియే మహాశివరాత్రి.

"విపత్ప్రతీకారపరా భవస్య
భువి ప్రసిద్ధేషు శివస్థలేషు
జనా మహారౌద్రకృతాభిషేకా
స్సజాగరా శ్శంభు ముపాసతేఽద్య"

చంద్రిక :— పరమశివునికి దాపురించిన అట్టియాపద శాంతించుటకై ప్రసిద్ధమైనశివస్థలములందు జనులు ఆశంకరునకు నమకచమకమహాన్యాసములతో వందలకొలది పర్యాయములు అభిషేకము లొనర్చి ఆవిషాగ్నికి శాంతులను కల్పింతురు. ఉపవాసజాగరములు భజనలు చేసి దైవపరులౌదురు.

"బదరీయుతార్క పత్రం
శిరసి నిధాయ నదీషు యే నిమజ్జంతి
సప్త జనికృతమహాఘం
హినస్తి రథసప్తమీ తేషామ్"

చంద్రిక :— రథసప్తమీతిథినాడు రేగుపండును జిల్లెడాకులో నుంచి దానిని శిరస్సులందు వహించి జనులు నదులందు స్నానమాడెదరు. దానిచే సప్తజన్మములందు చేసిన పాపము నశించునని భావన. ఇందుకు-

"సప్త సప్త మహాసప్త సప్తద్వీపా వసుంధరా
సప్తజన్మకృతం పాపం మకరే హంతి సప్తమీ"

అని ప్రమాణము.

"గోమయపిటకాగ్నిముఖే
సగుడం గోక్షీరతండులం మాఘే
భానుదినే రవితాపే
పక్త్వా వనితా నివేదయంతి రవేః"

చంద్రిక :—ఈరథసప్తమినాడు ఆవుపేడపిడుకలు దాలి వెట్టి-బెల్లము గోక్షీరము బియ్యమును పాత్రలో పోసి సూర్యమండలమున కెదురుగ నుంచి పచించి సూర్యునికి స్త్రీలు నివేదింతురు. నియమనిష్ఠలతో ఈకృత్యమును సలుపుదురు. ఆపరమాన్నమును తరువాత నందఱును కనులకద్దుకొని తిందురు.

"అవైదికై స్తైః పరిహాస్యతంత్రై
ర్దివానిశం భోజనసక్తసంఘైః
దినైకమాత్రైశ్శుభశోభనైశ్చ
జనా రమంతే శిశిరేఽతిహైన్యమ్"

చంద్రిక :—ఈకాలమున వివాహములు వైభవముగ జరుగుచుండును. కాని చాలమంది వేదములందు లేనితంత్రములు పెట్టుకొని వేదోక్తవిధులను చేయ మాని-రాత్రింబవళ్ళు కాఫికాపానభోజనాదులందే దృష్టి నుంచి ఒక్కరోజులో పెండ్లితంతును నడిపివేయుచుందురు. ఇది పరిహాస్యవిషయముగదా !

"శ్రీకృష్ణపాండవాగ్రే
శరతల్పగతః కృశో వశీ భీష్మః
నిర్యాణ మగా దేకా
దశ్యాం సా పుణ్యతిథిరితి ఖ్యాతా"

చంద్రిక:—శరతల్పమునం దుండి కృష్ణసహితపాండవుల సన్నిధిని నిగ్రహము పూని కృశించినభీష్ముడు ఈయేకాదశి నాడు మరణించుటచే దీనిని భీష్మైకాదశి యనియు పుణ్యతిథిగ భావింతురు. ఇది వ్యావహారికము.

కాని ధర్మశాస్త్రములలోను, భారతమందును మాఘ మాసశుక్లపక్షాష్టమి భీష్మాష్టమి అనియు ఆనాడాతనినుద్దే శించి తిలోదకము లీయవలెననియు, తలిదండ్రులు బ్రతికియున్న వారుగూడ ఈతర్పణము చేయవలెననియు ప్రసిద్ధముగ నున్న విషయము.

"గైర్వాణ్యాంధ్రాంగ్ల భాషాసు కించిజ్ఞా పితురాజ్ఞయా
రత్నావలీచంద్రికాఖ్యాం చక్రే వ్యాఖ్యాం ముదాన్వితా"

ఇతి- మస్కరిపురీనివాస

దువ్వూరి పెదశేషయ శేషమాంబా ద్వితీయపుత్త్రి

సూర్యనారాయణశాస్త్రి ప్రణీతాయాం

ఋతుచర్యాయాం శిశిరస్సమాప్తః

స ం పూ ర్ణ మ్.

